

క్రాస్నీ ప్రొలెతరి పరిశ్రమలో రేషనలైజేషన్, ఇన్వెన్షన్ విభాగాధిపతి అలెక్సీ బరనోవ్ (కుడి), రేషనలైజర్, షాపు ఫోర్మన్ నికితా అరిషిన్.

పక్షం - పొడవుగా జరుగనున్న ఆరవ ప్రపంచ యువజనోత్సవం మాస్కోలో జులై 28న, ప్రారంభించబడింది!

ఈ మహత్తర సంఘటనను చిత్రిస్తూ, రాబోవు 'సోవియట్ భూమి' సంచికలు యీ ఉత్సవ దినాలలో మాస్కోలో ఏమి జరుగుతున్నదో చాలా పుటలలో వివరిస్తాయి.

---

*రాబోవు సంచిక ఆగస్టు 25న వెలువడుతుంది*

## ఈ సంచికలో

సంపుటి 8
సంచిక 15

# సోవియట్ భూమి

ఆగస్టు 10, 1967

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



## క్రాస్నీ ప్రొలెతరీకి నూరేళ్లు వచ్చాయి

ఈ సంచికలో మేము. క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమకు సంబంధించిన పలు విషయాల గురించి అనేక వ్యాసాలను ప్రచురిస్తున్నాము. దీని శత వార్షికోత్సవం యిటీవల సోవియట్ దేశం అంతటా జరిగింది.

ఇద్దరు చేతిపనులవారు, బ్రోమ్లె సోదరులన్నవారు, 1857 మార్చిలో, ప్రాచీన దోన్‌స్కోయ్ మఠం పరిసరాలలోని తోటలకూ, నిర్మానుష్యమైన బయళ్ళకూ మధ్య. మాస్కో పొలిమేరల్లో చిన్న వర్క్‌షాపును నెలకొల్పారు. దానికుండే సామగ్రిఅంతా ఒక పురాతనమైన లేత్, సుత్తులు, దాగలిపట్టెడ మాత్రమే. కొన్ని సంవత్సరాలకాలంలో యీ వర్క్‌షాపు యంత్రపరికరాల పరిశ్రమగా అభివృద్ధి చెందింది, రష్యా యంత్రపరికర పరిశ్రమకు నాంది అయ్యింది. ఇప్పుడది సోవియట్ దేశంలో అన్నిటికంటె పాతదీ, పెద్దదీ అయిన యంత్ర పరికర పరిశ్రమ.

విప్లవానంతరం యీ పరిశ్రమను ప్రజల ఆస్థిగా మార్చడం, దాని చరిత్రలో నవశకానికి ఆరంభమైంది. గత కొద్ది దశాబ్దాలలో యీ పరిశ్రమ సాధించిన సత్వర ప్రగతిని. యీ దిగువ అంకెలద్వారా గమనించవచ్చును. 1927–28తో పోల్చితే 1950లో 15 రెట్లు, 1956లో 24 రెట్లకు పైగానూ అభివృద్ధి చెందింది. కార్మికునికి ఒక్కంటికీ ఉత్పత్తి 14 రెట్లు హెచ్చింది.

గత నలభై ఏళ్ళలో క్రాస్నీ ప్రొలెతరీ చరిత్ర, పరిశ్రమనే కాకుండా సోవియట్ దేశంలో ప్రతి ఒక్కదానినీ మార్చివేసిన గొప్ప సాంఘిక క్రమాలను ప్రతిబింబిస్తోందంటే అతిశయోక్తి యేమీలేదు. ఇందువల్ల క్రాస్నీ ప్రొలెతరీ శత వార్షికోత్సవం సోవియట్

(మిగత 7వ పేజీలో)



# అరవై, నలభై

జి. గవిచెన్కో

క్రాస్నీ ప్రొలెతరీ కర్మాగారపు చీఫ్ డిజైనింగ్ ఇంజినీరు



క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమాగారపు ప్రధాన డిజైనర్ గియోర్గీ గవిచెన్కో, యువక డిజైనర్లు వ్లాదిమిర్ క్లిమెనోవ్, ఇవాన్ బురవ్‌త్సోవ్‌తో

ఈ యంత్రాగారంలో నేను దాదాపు ముప్పై సంవత్సరాలనుండి పనిచేస్తున్నాను. కాని ఇప్పటి క్రాస్నీ ప్రొలెతరీని కొన్ని సంవత్సరాల క్రితం దానితో పోల్చడానికే వీలులేదు. ఒకప్పుడు అన్ని పనులూ చేతితోనే చేయబడు తుండేవి. అయినప్పటికి, ప్రవీణులైన కార్మికులు తయారుచేసిన యంత్రాలతో యీ యంత్రాగారం ప్రసిద్ధికెక్కింది. యంత్ర యజమానులు రష్యా అన్ని ప్రాంతాలనుండి ప్రవీణులు, అనుభవజ్ఞులు అయిన కార్మికులను తీసుకొంటుండే వారు. సమర్థవంతులైన పనివారిని పెట్టుకోవడం చాలా లాభదాయకంగా ఉంటుంది. ఆలాంటి వారిక్కడ వందలకొలది వున్నారు....

ఈ యంత్రాగారం జీవితంలోని మొట్టమొదట అరవై సంవత్సరాల (1857-1917) కాలంలో ఇది కార్మికుల యొక్క అద్భుతమైన ప్రావీణ్యత, యంత్రాల యొక్క వెనుకబాటుతనాల ఒక విపరీతమైన మిశ్రమంగా వుండేది.

## నలభై సంవత్సరాలు

ఆటుతర్వాత గడచిన నలభై సంవత్సరాల కాలంలో (1917-1957), బ్రోమ్లి బ్రదర్స్‌కు చెందిన యీ చిన్న కర్మాగారం యూరప్, అమెరికాలలో వున్న అత్యంత పెద్ద యంత్ర పనిముట్ల యంత్రాగారాలలో ఒకటిగా రూపొందించబడింది. ఎలాంటిరకానికి చెందిన యంత్ర పనిముట్టునైనా, యెంతటి కెపాసిటీ గలదానినైనా ఇప్పుడీ యంత్రాగారం డిజైను చేసి నిర్మించగలదు. 1946, 1955 సంవత్సరాల మధ్య యీ యంత్రాగారం, 150 క్రొత్త నమూనాల యంత్రపనిముట్లను—వీటిలో చాలా ఖచ్చితమైన ఫలితాల నివ్వడంలో పేరుపొందినవికూడా ఉన్నాయి—తయారు చేస్తున్నది.



క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమాగారపు పరిశోధనాలయంలో కొత్త లేతులు పరీక్షింపబడుతున్న దృశ్యం

క్రాస్నీ ప్రొలెతరీ యంత్రాగారంలో సమర్థులైన డిజైనర్లు, అత్యంత ప్రవీణులైన కార్మికులు, మొదటి తరగతికి చెందిన యంత్రాలు ఉన్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే ఇంకా అభివృద్ధి చెందడానికి అవసరమైనవన్నీ ఉన్నాయి.

1917 అక్టోబరు విప్లవానంతరం యీ యంత్రాగారంలో అనేక గుణాత్మకమైన మార్పులు జరిగాయి. సోవియట్ పరిపాలనా కాలములో అత్యంత ప్రావీణ్యతను, సాంకే

ఎసెంబ్లీ షాపుకుచెందిన డ్రిల్లర్ బోరిస్ గొర్బునోవ్



### సంఖ్యా వివరణ

ఈ యంత్రాగారంలో యేటేటా ఉత్పత్తి చేయబడుతున్న పనిముట్ల మొత్తాన్ని 1927-1929తో పోల్చిచూచినట్లయితే 1940లో 9.1 రెట్లు, 1950లో 14.4 రెట్లు, 1956లో 22.2 రెట్లు పెరిగినట్లు తెలుస్తుంది.

* * *

ఈ యంత్రాగారంలో కొత్తయంత్రాలను కనిపెట్టినవారు, రేషనలైజేషన్‌కు తోడ్పడినవారు, కార్మికులు, ఫోర్మెన్లు, సాంకేతిక నిపుణులు, ఇంజినీర్లలో వందలాదిగా ఉన్నారు. గత ఐదు సంవత్సరాలలో వీరు డిజైనులలోను, సాంకేతిక విషయాలలోను, శ్రమను యాంత్రికీకరణం చేయడంలోను పరిపూర్ణతను సాధించడానికి 5,213 ప్రతిపాదనలను చేసి తద్వారా 5,360,000 రూబుళ్ల ఆదా చేసారు.

* * *

ఈ యంత్రాగారం 1951–1955 సంవత్సరాల మధ్య భద్రత చర్యల కొరకు 1,997,000 రూబుళ్ళను వెచ్చించింది. ఈ పనికొరకే 1956-1960 మధ్య 2,400,000 రూబుళ్ల ఖర్చుచేయడానికి ఉద్దేశింపబడుతున్నది.

తిక విద్యను పొందిన కార్మికులు సాంకేతిక నిపుణులు, ఇంజినీర్లు తయారయ్యారు. ఇక్కడ పనిచేసే కార్మికులలో అనేకమంది సప్తవర్ష విద్యను పొందారు. సెకెండరీ స్కూలువిద్యను, కొన్ని సందర్భాలలో కళాశాల శిక్షణను పొందిన కార్మికులుగూడా వున్నారు. కొద్ది సంవత్సరాలక్రితం టర్నర్లు, ఫిట్టర్లుగా పనిచేసినవారు ఇప్పుడు ఇంజినీర్లుగా తయారయ్యారు. మాయంత్రాగారంలోని కార్మికులకు విద్యాసౌకర్యాలను కలిగించేందుకు యెంత డబ్బునైనా ఖర్చుపెట్టడానికి సోవియట్ ప్రభుత్వం వెనుకాడదు. ఈ యంత్రాగారానికి సాయంత్రపు సెకెండరీ పాఠశాల ఒకటి, సాయంత్రపు సాంకేతిక పాఠశాల ఒకటి, ఇంజినీరింగ్ విద్యాసంస్థ శాఖ ఒకటి వున్నాయి. వందలాది మా కార్మికులు యీ పాఠశాలల్లో విద్యనభ్యసించారు. ఇప్పుడు వారు యంత్రాగారంలోని వివిధ విభాగాల్లోను, షాపులలోను, డిపార్టుమెంటులలోను ముఖ్యులుగా వుంటున్నారు.

ఉదాహరణకు అలెగ్జాండర్ కుర్నకోవ్ విషయం తీసుకోండి. అతడు 1930లో ఈ యంత్రాగారంలో ఎప్రెంటిస్‌గా చేరాడు. కొద్ది సంవత్సరాల క్రితం ఇతడు సాయంత్రపు సాంకేతిక పాఠశాలనుండి పట్టభద్రుడైనాడు. ఇప్పుడు అసిస్టెంటుషాప్ సూపరింటెండెంటుగా పనిచేస్తున్నాడు. అతని 22సంవత్సరాల కుమారుడు, అనతోలి ఇప్పుడు యీ యంత్రాగారంలోనే ప్రవీణుడైన మోడలర్‌గా పనిచేస్తున్నాడు. సాంకేతిక పాఠశాలలో విద్యాభ్యాసాన్ని కూడా



వెర్టికల్ లేత్ మీద పనిచేస్తోన్న టర్నర్ నికొలాయ్ కుజ్మిన్



## సంఖ్యా వివరణ

మొత్తం 14 000 చదరపు మీటర్ల విస్తీర్ణపు నివాస స్థలంగల ఇండ్లు 1957–1960 మధ్య నిర్మింపబడుతాయి. ఎనిమిది అంతస్తుల ఒక భవనం గత మే మాసంలో పూర్తిగా నింపబడింది యంత్రాగారంలో పనిచేసే 115 మంది కార్మికులకు ఇందులో వసతి యేర్పాటు చేయబడింది. కార్మికుల పిల్లలకొరకు బాలోద్యానవనాలు, శిశుసంరక్షణాలయాలు, నగరానికి దూరంగా కార్మికుల పిల్లలకొరకు విదుగృహాలు, పాలీక్లినిక్ కొరకు కొత్త భవనాలు రాత్రి ఆరోగ్య మందిరాలు, బంధువు లెవరూలేని వృద్ధులకు సంరక్షణ గృహాలు నిర్మించడానికిగూడా పథకాలు తయారు చేయబడ్డాయి.

పొందుతున్నాడు. అతని చెల్లెలు లూద్మిల్లా అదే పాఠశాలలో విద్యాభ్యాసం చేసింది. ఇప్పుడు యీ యంత్రాగారంలో డిజైనర్‌గా పనిచేస్తున్నది. మా సాయంత్రపు సాంకేతిక పాఠశాల గత పద్దెనిమిది సంవత్సరాలలో 1,600 మంది ప్రవీణులను తయారు చేసింది మాయంత్రాగారంలో విజ్ఞానాన్ని పొందాలన్న ఆకాంక్ష, ఉత్పత్తిని రేషనలైజ్ చేయాలన్న ఆసక్తితో సమ్మిళితమై వుంటుంది. మా యంత్రాగారంలో దాదాపు ప్రతి కార్మికుడు ఉత్పత్తిని వృద్ధిచేయడానికి, రేషనలైజ్ చేయడానికి కొద్దో, గొప్పో కృషిచేశాడు. బహుశ, గత నలభై సంవత్సరాలలో యీ యంత్రాగారం సాధించిన ముఖ్య విజయాలలో, విజ్ఞానసముపార్జన ప్రత్యేకశిక్షణ, సృజనాత్మక కృషి ప్రధానమైనవేమో.



★

కొమ్సొమోల్ సభ్యులు రెంతవ, ఇంజనీరింగ్ షాపు ప్లెక్సాలజిస్టులు ఓలా కొచురోవ్కావా, నీనా ఐజెనోవా, ఎలెక్ట్రోకార్ డ్రైవర్ సెర్గీ మైష్కిన్ షాపుయొక్క కుడ్య వ్యంగ్య వార్తాపత్రిక "కనువిప్పు"ను తయారుచేస్తోన్న దృశ్యం

★

క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమాగారపు కార్మికులకు, ఇంజనీర్లకు మాస్కోలోని దోన్‌స్కాయా వీధిలో నిర్మితమవుతున్న భవనం



# మా పరిశ్రమాగారం ఎట్లా నడుపబడుతుంది


## నికొలాయ్ కుజ్మిన్,

క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమాగారపు టర్నర్, రష్యన్ సమాఖ్య
సుప్రీం సోవియట్ సభ్యుడు, స్టాలిన్ బహుమతి విజేత


ఈ పరిశ్రమకు మొదట నేను యిరవై ఏళ్ళ క్రితం వచ్చాను. నేను పనిలో చేరినరోజున పాత ఫోర్మెన్ పీటర్ గ్రెవెన్నికోవ్—నేను యీయనక్రింద అప్రెంటిస్‌గా పనిచెయ్యాలి—నాతో యిలా చెప్పారు.

"అయితే టర్నరయి, మా పరిశ్రమలో నీవు పని చెయ్యాలని వుందా? ఇది చాలా బాగుంది, కాని అబ్బాయి నేను నీకో సంగతి చెపుతాను. నువ్వు నిజంగా టర్నర్ అవుదామనుకుంటే, యీ క్షణం నుండీ నీకు సంబంధించిన అన్ని విషయాలకూ బాధ్యుణ్ణని నువ్వు భావించుకోవాలి. బోధపడిందా?"

పీటర్ గ్రెవెన్నికోవ్ చెప్పిన సలహా నాకు చాలా కష్టమనిపించింది. కాని తక్కిన పాత కార్మికులకు యీయనకూ ఏ విధంగానూ తేడాలేదని తరవాత నేను తెలుసుకున్నాను. పరిశ్రమలోని ప్రతినట్టూ, ప్రతి స్క్రూ వాళ్ళందరికీ ప్రియమైనది. అవసరమైతే షాపు సూపరెండెంటునూ, డైరక్టరును సైతం వాళ్లు చీవాట్లు పెట్టేసేవారు.

1918 నుండీ క్రాస్నీ ప్రొలెతరీకి చాలామంది డైరెక్టర్లు వచ్చారు. అక్టోబరు విప్లవానంతరం ఇయొసిఫ్ బొగ్దనొవిచ్ అనే చాలా నిపుణుడైన మిల్లింగు మిషీన్ ఆపరేటర్ తొలి డైరెక్టరుగా నియమింపబడ్డారు. కొందరు డైరెక్టర్లు నాకు పరిచయస్తులు. ఉదాహరణకు వారిలో ఒకరు ఆర్కాడీ ఒరొబ్యోవ్. ఆయన యీ పరిశ్రమకు కుర్రవానిగా వచ్చారు, అప్రెంటిస్ ఫిట్టర్‌గా పనిని ప్రారంభించారు, ఆర్కాషా అని ఆయన ముద్దుపేరు. కష్టపడి పనిచేసే తెలివైన కుర్రవాడతను, ఏదైనా తొందరగా నేర్చుకునేవాడు కొద్ది ఏళ్ళలో ఆయన ఒక దళనాయకుడయ్యారు. తరవాత ఆయన అసిస్టెంట్ ఫోర్మెన్, తరవాత సెక్షన్ అధిపతి, షాపు సూపరెంటెంట్, చివరికి డైరెక్టర్ అయ్యారు. ఆ తరవాత ఉపమంత్రికూడా అయ్యారు. అప్పటికి ఇంకో ఫిట్టరు పీటర్ తరనిచెవ్ డైరెక్టరయ్యారు.

ఇప్పటి డైరెక్టరు, డిజైనింగ్ ఇంజనీరు గియోర్గీ సుర్గొచెవ్. ఈయన మా పరిశ్రమకు కుర్రవానిగా వచ్చి, మాకళ్ళ ఎదుటనే ఇప్పటి పదవిని అందుకున్నారు. మా పరిశ్రమలో ఎటువంటివారు అధికారులవుతున్నారో, యీ ఉదాహరణలు తెలియజేస్తాయి.

మా కార్మికుల సమిష్టి సంఘం ఎక్కువగా జ్ఞానాన్ని సంపాదించి, మంచి ఆర్గనైజర్లుగా వున్నవారిని తమలోనుండి కార్యనిర్వాహకులుగా ఎంచుకుంటుంది. వారి బాధ్యతలు గొప్పవి, కాని వారి అధికారంకూడా గొప్పదే. ఒక పెద్దసంస్థ అరాచకత్వాన్నీ, చేతకానితనాన్నీ, బహునాయకత్వాన్నీ సహించలేదుకాబట్టి ఇది వేరువిధంగా వుండడానికి వీల్లేదు. ఒక సోవియట్ పరిశ్రమలో ఉత్పత్తి కమాండర్‌కు చాలా అధికారంవున్నప్పటికీ, అతను ప్రజలకు జవాబుదారీగా వుంటాడు. కార్మికుల సమిష్టి సంఘం, ట్రేడ్‌యూనియన్, పార్టీ, దాని వివిధ సంఘాలూ కార్యనిర్వాహక సంఘ కార్యకలాపాలను పరిచూడడానికి హక్కును కలిగివున్నాయి. సరిగ్గా యీహక్కు యొక్క అర్థం ఏమిటి? అది ఎలా అమలు జరుగుతుంది.

ఒక ఉదాహరణను చూద్దాం. మా పరిశ్రమ ఒక కష్టమైన సాంకేతిక సమస్యను పరిష్కరిస్తూ వున్నప్పుడు, మామూలు ఉత్పత్తికి భంగం కలగకుండా ఒక కొత్తరకపు యంత్రపరికరాన్ని ఉత్పత్తి చేయడానికి మాషాపులను పునర్మించే సమస్యను పరిష్కరిస్తూ వున్నప్పుడు, మా డైరెక్టరు, చీఫ్ యింజనీరు, షాపు సూపరెండెంట్లు పని ఎలా సాగుతూవున్నదీ కార్మికుల సమిష్టి సంఘానికి తరచుగా నివేదిస్తూ వుండేవారు. అన్ని షాపుల్లోనూ రోజూ పది సభలు జరుగుతూవుండేవి. కార్మిక సంఘం సమావేశపరచిన యీ సభలలో కార్మికులు పునర్నిర్మాణ ప్రగతిగురించి చర్చించేవారు. డిగెతెల్ (ఇంజిన్) అన్న పరిశ్రమ వార్తాపత్రిక, వివిధ శాఖల్లోని గోడ వార్తాపత్రికలు, పరిశ్రమకు సంబంధించిన స్థానిక రేడియో ప్రసారాలూ కూడా ప్రతి ఒక్కరికీ పనిని గురించి తెలియజేస్తూ వుండేవి. పరిశ్రమలోని యువజనులు అన్నిరంగాలలోనూ తమ పరిశీలనా కేంద్రాలను ఏర్పరచుకున్నారు. ఫోర్మెన్, షాపు సూపరెండెంట్లు, డైరెక్టరుసైతం చేసే రద్దును గురించి, చేతకాని తనంగురించి ప్రతి ఉదంతమూ అందరికీ తెలియచేయబడేది.

ఇక్కడొక ఉదాహరణను యిస్తున్నాము. మా షాపు ఫోర్మెన్ సొలొవ్యోవ్ తన విరామసమయంలో ప్లానింగ్ యంత్రంకోసం ఒక కొత్తరకం యంత్రాన్ని డిజైన్ చేశారు. ప్రయోగార్థం కొత్తరకపు కట్టర్లు తయారుచేయబడ్డాయి. అవి చాలా మంచిఫలితాలను యిచ్చాయి. ఇప్పుడు షాపు సూపరెండెంటు, పరిశ్రమ యాజమాన్యమూ ఎక్కువ సంఖ్యలో కొత్త కట్టర్లను తయారుచేయించి, వాటిని ఉపయోగించడానికి కార్మికులకు శిక్షణనివ్వడమే తరవాయి. ఈ విషయం చాలా కాలం నడిచి, చివరికి కాగితాల్లో వుండిపోయింది. కాని ఆఖరుకు షాపు ఉత్పత్తి సమావేశంలో యీ విషయం వచ్చింది (వారానికొక్కసారి ఈ సమావేశాలు జరుగుతాయి సిబ్బంది అంతా వాటిలో పాల్గొంటుంది) ఆ సమావేశంలో ప్రతీదీ నిర్మొగమాటంగా చెప్పబడింది.

(మిగత 40వ పుటలో)



# క్రాస్నీ ప్రొలెతరికి
## నూరేళ్లు వచ్చాయి





క్రాస్నీ ప్రొలెతరీ ప్రతినిధివర్గానికి పరిశ్రమాగారపు శత వార్షికోత్సవ సందర్భంగా కె.వై. వొరొషిలోవ్ బిరుదు ప్రదానంచేస్తోన్న దృశ్యం

(1వ పుట తరువాయి)

పరిశ్రమకూ, సోవియట్ కార్మికవర్గానికీ, యావత్తు సోవియట్ దేశానికీ మహోత్సవ దినమైందంటే ఆశ్చర్యమేమీ లేదు. ఆ రోజున— 1957 మార్చి 14 న, పరిశ్రమకూ, దాని కార్మికులకు చాలా మందికీ ప్రభుత్వం యిచ్చిన పారితోషికాల గురించీ, కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ, ప్రభుత్వమూ దాని సిబ్బందికి పంపిన అభినందన సందేశాలనూ వార్తా పత్రికలన్నీ ప్రచురించాయి.

సాయంకాలం కార్మికులు, తమ కుటుంబాలతో బాటుగా, యీ పారితోషికాలను యిచ్చే సభకోసం మాస్కో లెనిన్ స్టేడియం క్రీడా భవనంలో సమావేశమయ్యారు. సోవియట్ దేశంలోని వివిధ యంత్ర పరికర పరిశ్రమలనుండి, యితర ఫ్యాక్టరీలనుండి ఎంతోమంది అతిథులూ, ప్రతినిధివర్గాలూ యీ ఉత్సవంలో పాల్గొన్నారు. సుమారు ఐదువేల మంది హాజరయ్యారు. పరిశ్రమయొక్క దీర్ఘానుభవజ్ఞులైన కార్మికులతోబాటుగా పార్టీ, ప్రభుత్వ నాయకులు అధ్యక్షవర్గ వేదికపైని ఆసీను లయ్యారు. అధ్యక్షుడు క్లిమెంట్ వొరొషిలోవ్ పరిశ్రమ ప్రతినిధివర్గానికి ఆర్డర్ ఆఫ్ రెడ్ బేనర్ ఆఫ్ లేబర్‌నూ, దాని కార్మికులకు పతకాలనూ బహూకరించారు. వ్లాదిమీర్ ఎర్మిలోవ్‌కూ, కాన్‌స్తంతిన్ సరఫనోవ్‌కూ—వీరు ఫిటర్లు—సామ్యవాద శ్రమవీర స్వర్ణతారలూ, ఆర్డర్ ఆఫ్ లెనిన్ బహుమానాలూ లభించాయి. మాస్కో ఫ్యాక్టరీలకూ, ప్రజా సంస్థలకూ చెందిన అనేక ప్రతినిధివర్గాలు అభినందన సందేశాలతోనూ, పారితోషికాలతోనూ క్రాస్నీ ప్రొలెతరీకి వెళ్లారు.

క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమాగారపు కార్మికులను అభినందించ వచ్చిన బోల్షాయ్ థియేటర్ కళాకారులు



# కార్మికుడు, కర్మాగారం

## కాన్‌స్టాంటిన్ సరఫనోవ్

### ఫిట్టర్, సామ్యవాద శ్రమవీరుడు



సామ్యవాద శ్రమవీరుడు, కాన్‌స్టాన్టిన్ వరఫనోవ్, 630వ పాఠశాలలో మూడవ ఫారం చదువుతున్న తన మనుమడు వాలోద్యాతో లుజ్నికి క్రీడాభవనంలో

అరవై అయిదు సంవత్సరాలపాటు నేను "క్రాస్నీ ప్రొలెతరీ" అనే మాస్కో లేత్ నిర్మాణ యంత్రాగారంలో ఫిట్టర్‌గా పనిచేశాను.

చాలా కాలం క్రితం, 1892లో, వసంతకాలపు ఒకదినాన, పద్నాలుగు సంవత్సరాల కుర్రవాడనుగా ఉన్నప్పుడు యేదైనా పని దొరుకుతుందేమోనన్న ఆశతో యీ యంత్రాగారం ఆవరణలోనికి వచ్చిన విషయాన్ని గురించి ఒక్కొక్కప్పుడు తలుచుకొంటూ ఉంటుంటే, అది నిన్న మొన్ననే జరిగినట్లుగా అనిపిస్తుంది. పని దొరుకుతుందని ఆశించడానికి యే ఆధారమూ లేదు. సహాయం చేయడానికి యెవ్వరూ లేరు. మా తండ్రి జబ్బుతో ఉండేవాడు. కుటుంబం చాలా పెద్దది. ఏదోఒక విధంగా నేను పొట్టకూటికోసం సంపాదించుకొనవలసి వచ్చింది. అదృష్టవశాత్తు నాకు ఫిట్టర్ పనిలో అప్రెంటిస్‌గా ఉద్యోగం దొరికింది. ఈ యంత్రాగారపు పూర్వపు యజమానులు నాకు ఇష్టావచ్చిన రోజులు. ఇరవై కోపెక్కులకు నేను యేమేమి పనులు చేయవలసి వచ్చేదనుకున్నారు? ఉదయంనుండి, రాత్రివరకు అందరు చెప్పిన పనులమీద తిరగవలసివచ్చేది. కాగితాలను బట్వాడా చేయవలసివచ్చేది. ఎప్పుడూ రుసరుసలాడుతూ ఉండే ఫోర్మెన్ ఆజ్ఞలను శిరసావహించవలసివచ్చేది. కాగా, నిపుణులైన ఫిట్టర్లు యెలా పనిచేస్తున్నారో చూడడానికి ఒకటి, అర క్షణాలకంటే ఎక్కువ కాలం లభించేది కాదు

అరవై అయిదు సంవత్సరాలు గడిచిపోయాయి. "నా జీవితం యావత్తు"—అలా అనవచ్చుననుకుంటాను—ఈ యంత్రాగారంతోనే ముడిపడి వుండిపోయింది. నామిత్రులు, శిష్యులు, నన్ను యీ యంత్రాగారం యొక్క మూర్తీభవించిన చరిత్ర అని పిలుస్తారంటే వాళ్లు అలా ఊరకనే అనడంలేదు. ఈ ఛలోక్తి వెనుక యెంతో యదార్థం వున్నది. గడిచిన ఇన్ని సంవత్సరాలలో, యంత్రాగారంలో జరిగిన విషయాలలో నేను చూడనివిగాని, నాకు గుర్తులేనివిగాని యేవీలేవు. ఎంతో బాగా గుర్తున్నాయి! పూర్వపు రోజుల్లో కార్మికుడు యెలాంటి కష్టాల్లో కాలం గడుపవలసివచ్చేదో నాకు గుర్తున్నది. కార్మికులమైన మేము మా యంత్రాగారానికి అధిపతులమైనప్పటి 1917 సంఘటనలలో పాల్గొనే అదృష్టం నాకు కలిగింది. ఈనాడు వెనుకటి విషయాలను ఆలోచించుకొంటూ, అక్టోబరు సోషలిస్టు మహా విప్లవాన్ని గురించి తలుచుకొంటే, కార్మికుల జీవితాల్లో అందులో నా జీవితంలో గూడా, వచ్చిన అద్భుతమైన మార్పు నన్నెంతో ఆశ్చర్యపరుస్తుంటుంది.

గత ఆరురాలు కాలంలో ఉద్యోగ విరమణ చేసినప్పుడు యంత్రాగారాన్ని వదిలిపెట్టడమంటే నాకు ఎంతో బాధ అనుపించింది. ఆ యంత్రాగారంలో ఉంటే నాకు ఇంట్లో ఉన్నట్టే అనుపించేది. దానిలో పనిచేసే కార్మికులు, ఇతర ఉద్యోగులు నా కుటుంబీకుల లాగా ఉండేవారు! యంత్రాగారం సమస్యలు నా స్వంత సమస్యలే ననిపించేవి!

ఉద్యోగ విరమణ చేసింది నేనొక్కడినే కాదు. పాత కార్మికులలో అనేకులు నాలాగనే ఉద్యోగవిరమణ చేశారు. యంత్రాగారానికి చెందిన వారు మాకుగొప్ప వీడ్కోలు నిచ్చారు. నాకు ఒక బంగారు చేతి గడియారాన్ని బహూకరించారు. ఇక స్త్రీలైతే పుష్పవర్షమే కురిపించారనుకోండి! మా డైరెక్టర్ జియోర్గి సుశాచేవ్ (1930లో యంత్రాగారంలో డ్రాఫ్ట్స్‌మ్యాన్‌గా పనిచేయడానికి యీతడు వచ్చినప్పటిసంగతులు నాకు ఇప్పటికీ బాగా గుర్తు)నాకు యెప్పుడు బడితే అప్పుడా యంత్రాగారంలోకి వెళ్ళడానికి ప్యాసును ఇచ్చారు.

"మీకు సాధ్యమయినప్పుడల్లా మాదగ్గరికి రావాలి కోస్త్యా మామయ్యా (నన్ను వాళ్ళలానే పిలిచేవారు), తండ్రిలాంటి మీరు సలహా నిస్తుండటం మంచిది!" అని ఆయన అన్నారు.

నేను పూర్తిగా విశ్రాంతి తీసుకొంటూ యంత్రాగారానికి వెళ్ళక తొమ్మిది మాసాలైనది. నా కొడుకులు దిమిత్రీ, బోరిస్ ఆ యంత్రాగారంలోనే రోజూ పనిచేస్తున్నారన్న విషయం యెంతో తృప్తిని కలుగజేస్తుంది. నా కూతురు ఇకతరీనా, మేనల్లుడు కాన్స్‌తాంతిన్, అతని చెల్లెలు మరియాకూడా ఈ యంత్రాగారంలోనే పనిచేస్తున్నారు. నా జీవితంవలెనే వారి జీవితాలు గూడా ఈ యంత్రాగారంతో అవినాభావ సంబంధాలను కలిగిఉన్నాయని చెప్పవచ్చును. యంత్రాగారమే వారికి సాంకేతిక విజ్ఞానాన్ని, వృత్తులను, యోగ్యతాపత్రాలను చేకూర్చింది. ఆ యంత్రాగారంలో పనిచేస్తూనే వారు ప్రేమించి పరిణయ మాడారు. ఎక్కడ నివసిస్తున్నారనుకుంటున్నారు? యంత్రాగారం వారు యిచ్చిన ఇండ్లల్లోనే. వారిపిల్లలను, అనగా నా మనుమలను గురించి యెవరు శ్రద్ధ తీసుకొంటున్నారు? యంత్రాగారానికి చెందిన బాలోద్యానవనాలు, నర్సరీలు. యంత్రాగారానికి సంబంధించిన విశ్రాంతిగృహాలు, ఆరోగ్యమందిరాలలో వసతులు కల్పింపబడుతాయి. యంత్రాగారానికి సంబంధించిన పాఠశాలల్లోనే విద్యాభ్యాసం చేస్తూ, యంత్రాగార క్రీడామందిరాల్లోనే ఆటలాడుకొంటుంటారు.

బహుశ నా కుటుంబాన్ని గురించి చాలానే చెప్పానేమో? ఈ ముసలివాడు వట్టి డాబులు చెప్పుకొనేవాడని అనుకుంటారేమో. కాని ఎనభై సంవత్సరాలవాడు డాబులు చెప్పుకోవడంలో అర్థం ఉండదు. కాని తనకేగాక, ఇతరులకుగూడా ఆనందాన్ని కలుగజేసే విషయాలేవైనా వుంటే, తన ఆఖరు రోజుల్లో తప్పక గర్వపడవలసే వుంటుంది. అనగా, ఒక్క నా జీవితంలోనేగాక, నా మిత్రులందరి జీవితాల్లోను మార్పులు తెచ్చిన గత నలభై సంవత్సరాలు, రష్యా కార్మికుల జీవితాల్లో వచ్చిన మార్పులని నా ఉద్దేశ్యం. పూర్వపు రోజుల్లో 12 నుండి 14 గంటలవరకు పనిచేస్తూ, క్షయకు, ఆకలికి ఆలవాలమైన మురికి కూపాల్లో నివసిస్తూ, దాదాపు బిచ్చగాళ్ళవలె జీవితాలను గడుపుతూ, తమ యజమానులతో మాట్లాడడానికి కూడా సాహసించని అమాయక కార్మికుల జీవితాల్లో వచ్చిన మార్పులని నా ఉద్దేశ్యం.

నేను చెప్పబోయే దేమిటంటే, మా యంత్రాగారాన్ని, మా ప్రభుత్వాన్ని మేమే నడుపుకోవడం ప్రారంభించాక జీవితం అసలు పోల్చడానికి వీలులేనంతగా మారిపోయింది. మురికికూపాల స్థానంలో, సువిశాలమైన ఇండ్లు వచ్చాయి. సోషలిస్టు ప్రభుత్వంలో కార్మికుడు అత్యంతంగా గౌరవింప బడుతున్నాడు.

కోల్యా ఫెదిన్ విషయమే తీసుకోండి. ఈ యువకుడు మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో ఇక్కడికి పనిచేయడానికి వచ్చాడు. బాగా కష్టపడి పని చేసేవాడు. కాని కొద్ది కోపెక్‌ల జీతం మాత్రమే లభించేది. పుస్తకాలంటేను, విజ్ఞానం అంటేను అతనికి యెంతో ఆసక్తి. చదువుకోవాలని తనకు అభిలాష ఉన్నట్టు నాతో చెబుతుండేవాడు. కాని అప్పటి రోజుల్లో అలాంటి విషయం ఊహించడానికే వీల్లేదు. చిరస్మరణీయమైన విప్లవపు రోజుల్లో, అప్పటికి ఇంకా బాలుడుగానే వున్న ఫెదిన్ ఇతరులతోపాటు కలసి కార్మికుల ప్రదర్శనాలను జరిపించాడు. అందువల్లనే అతడు 1917 లో యంత్రాగార నిర్వహణను హస్తగతం చేసుకున్న ఫ్యాక్టరీ కమిటీకి ఎన్నుకొనబడ్డాడు. విప్లవం జరిగిన వెంటనే ఫెదిన్ పుస్తకాలపై మనస్సును కేంద్రీకరించాడు. కార్మికుల పాఠశాల పరీక్షలు ప్యాసయి, చివరికి పట్టభద్రుడు కూడా అయ్యాడు. కార్మికులనుండి తయారైన మొట్టమొదటి ఇంజనీర్లలో అతడొకడు. సోవియట్ దేశంలోని లేత్, యంత్ర పనిముట్ల నిర్మాణ ప్రవీణులలో నేడు సీనియర్ కన్‌స్ట్రక్షన్ ఇంజనీర్ నికొలాయ్ ఫెదిన్ ప్రముఖుడనడంలో యెలాంటి సందేహమూ లేదు. చాలా క్లిష్టమైన వాటితో సహా, అనేక పనిముట్లను ఆయన సృష్టించారు.

కాని ఫెదిన్ ఒక్కడే ఇలా పైకి వచ్చినవాడైతే ఆ విషయం చెప్పడంలో అర్థముండదు. ఉన్నత విద్యను పొందగలిగిన సాధారణ కార్మికులు ఇతరదేశాల్లో మాత్రంలేరా? కాని తేడామాత్రం ఒక్కటే, *సోవియట్ జీవిత కథలో ఫెదిన్ కథ సర్వసాధారణమైనది!* ఇంజనీర్లు గాని, సాంకేతిక నిపుణులుగాని ప్రవీణులైన కార్మికులుగాని లేని కుటుంబం మాలో ఒక్కటీ లేదని నేను ఘంటాపథంగా చెప్పగలను. మా "క్రాస్నీ ప్రోలితరీ" యంత్రాగారం కార్మికులనుండి వచ్చిన ఇంజనీర్లేగాక, పరిశోధకులుగూడా వున్నారు. అందుకే నేను ఈ విషయాలను అంత గర్వంతో చెప్పుకొంటున్నాను.

ఒక్కముక్కలో చెప్పాలంటే మా యంత్రాగారాన్ని ప్రేమించకుండా వుండడం అసాధ్యం. ఎందుకంటే, ప్రతియొక్క కొత్తషాపు, ప్రతిగోడ మా చేతితోనే స్వయంగా నిర్మింపబడింది. మాది తప్ప ఇంకెవ్వరిదీ కాదది! 1917 లో లెనిన్ నాయకత్వంక్రింద స్థాపింపబడిన సోవియట్ ప్రభుత్వం మా దేశంలోని సమస్త ప్రజల జీవితాల్లో తెచ్చిన మార్పులు, అనగా మా జీవితంలో తీసుకువచ్చిన మార్పులు మాపనిలో వచ్చిన మార్పులతో యేదో ఒకవిధంగా సంబంధాన్ని కలిగివున్నాయి.

# కర్మాగారం, కార్మికుల ఆరోగ్యం

డాక్టర్ ఎకతెరినా జమొష్కినా

నేను అనేక సంవత్సరాలుగా క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమలో పనిచేస్తున్నాను. ఇక్కడ నేను వైద్యం చేస్తోన్న కాలంలో అనేక మంది రోగులతోనేకాకుండా, పరిశ్రమ కార్మికులందరితో కూడా పరిచయమైంది.

పాత రోజుల్లో యీ పరిశ్రమ యజమానులకు కార్మికుల ఆరోగ్యం గురించి యెంత మాత్రమూ శ్రద్ధవుండేదికాదు. ఆరోగ్య రక్షణకు కర్చుచేయడానికి ఎంతమాత్రమూ ఒప్పుకునేవారు కాదు.

పాత కార్మికులలో ఒకరు—యీయనకు నేను చికిత్స చేసేవాడిని—1909లో పరిశ్రమలోని ఒక షాపులో తన ఎదుటనే జరిగిన ఒక సంఘటన గురించి నాకుచెప్పారు. ఒక యినుప భాగాన్ని ఎత్తుతూ వుండగా ఫిట్టర్ బోల్డిర్యేవ్‌కు ఎడమ ముంజేయి విరిగిపోయింది. ఈయనకు వైద్య సహాయం చెయ్యడానికి ఎవ్వరూలేరు. ఈ పరిశ్రమలో శిక్షణ పొందిన నర్సు ఒక్కతే వుండేది. విపరీతమైన బాధతో బోల్డిర్యేవ్ రెండు నెలలు యింట్లో వున్నాడు. ఇది పరిశ్రమలోనే జరిగినప్పటికీ, కార్మికునిక్కి సాయపడడానికి యజమాని ఏమీ చేయలేదు.

ఇప్పుడు పెన్షన్లు పుచ్చుకుంటోన్న మా వృద్ధ కార్మికులకు, పనివాని జీవితం ఒక కోపెక్కు కూడా విలువచెయ్యని రోజులు, గర్భిణీస్త్రీలను పనిలోనుండి బర్తరపు చేసిన రోజులు, ఉద్యోగుల బిడ్డలకొరకు పరిశ్రమలో శిశుపోషణాలయాల గురించి గాని, బాలోద్యానవనాల గురించిగాని కలలోకూడా ఊహించలేని రోజులు, ఆసుపత్రులుగాని, ఆరోగ్య మందిరాలుగాని లేని రోజులు బాగా జ్ఞాపకం వున్నాయి. ఇది నలభై ఏళ్ళ క్రితపుమాట. కాని యిప్పుడు, తక్కిన డాక్టర్లతో కలసి నేను ఉదయం పని చేయడానికి వచ్చి, మా వైద్య సేవ కలిగించే సౌకర్యాలను గురించి ఆలోచించేటప్పుడు, నాకు సంతోషంగా వుంటుందని చెప్పక తప్పదు. పరిశ్రమలోని ఉత్పత్తి శాఖలకు వస్తుసామగ్రి బాగా వుండడం మాత్రమేకాదు, దాని వైద్యశాఖ కూడా దానికి తగినట్టుగా వుంటుంది. చికిత్స జరిగే అనేక గదులూ, అనుభవజ్ఞులైన వైద్యుల సిబ్బంది, అధునాతన వైద్య సామగ్రిగల ఒక పోలీక్లినిక్ యీ శాఖలో వుంది. దానికి ఒక ఆసుపత్రి కూడా వుంది. ఇక్కడ తీవ్రమైన జబ్బులతో వున్నవారికి అతినవీనమైన చికిత్స లభిస్తుంది. ఈ పరిశ్రమకు స్వంత ఆరోగ్య మందిరం కూడా వుంది. దీనిలో వైద్యసలహా ప్రకారం కార్మికుల * చికిత్స లభిస్తుంది.

శిశుపోషణాలయాలూ, బాలోద్యానవనాలూ, బాలసంఘ సభ్యుల వేసవి శిబిరం—మాస్కోకు ఆవల నొక అందమైన తావులో కార్మికుల పిల్లలకోసం పరిశ్రమ నెలకొల్పిన ఒక చిన్న నగరం యిది—యివ్వన్నీ వైద్యశాఖ కార్యకలాపాల లోనివే. ఇది కాక, షాపులలో ఆహార శాలలలోనూ, పరిశ్రమ ఆవరణలోనూ పారిశుద్ధ్యం గురించి తనిఖీ చేయడం కూడా వైద్య సిబ్బంది విధి. శ్రామిక రక్షణకు, మాతా శిశువుల రక్షణకుసంబంధించిన చట్టాలు అమలు జరిగే లాగా వారు శ్రద్ధవహించాలి కూడా.

పరిశ్రమ పూర్వపు యజమాని శ్రామిక రక్షణ గురించి పట్టించుకునేవాడుకాదు. ఎంతో మంది కార్మికులు ప్రతి సంవత్సరమూ అశక్తులయిపోయి, బిచ్చగాళ్లగా బ్రతకవలసి వచ్చేది. షాపులలో పరిశుభ్రమైన గాలి ఏర్పాటుగురించి గాని, యంత్రాలవద్ద దడిపెట్టడం గురించిగాని, కార్మికుల ఆరోగ్యాన్ని, ప్రాణాలనూ యితర విధాల కాపాడడం గురించిగాని ఎవ్వరూ పట్టించుకునేవారుకాదు. తొలిరోజుల నుండి సోవియట్ దేశం, వి. ఐ. లెనిన్ సూచనపైని యీ ముఖ్యవిషయం గురించి ప్రత్యేకమైన శ్రద్ధను వహించింది. చట్టం ప్రకారం, పరిశ్రమ వైద్యులు కార్మికుల ఆరోగ్యం గురించి విధిగా శ్రద్ధవహించాలి. ఉదాహరణకు, పరిశ్రమలో యీ దిగువనిచ్చిన సంఘటన జరిగింది: కార్మికుల ఆరోగ్యానికి సంబంధించిన నిబంధనలు రంగుల షాపులో పాటింపబడడం లేదని డాక్టర్ సొలోద్కినా గమనించారు.



క్రాస్నీ ప్రొలెతరీ కర్మాగారపు ఆసుపత్రిలో డాక్టర్ ఎకతెరినా జమొష్కినా, వ్యాధిగ్రస్తుడైన థెర్మల్ షాపు ఫోర్మన్ నికొలాయ్ కముష్కిన్ పడకవద్దనున్న దృశ్యం

పనిని వెంటనే ఆపివెయ్యాలనీ, యింకోచోటికి కార్మికులను పంపాలనీ, అవసరమైన పరిశుద్ధ వాయువుకు ఏర్పాట్లు చేయాలనీ డాక్టరుచెప్పారు. ఆషాపు అధిపతి వెంటనే డాక్టరు చెప్పినట్టు చేశారు. తరవాత నాయన పరిశ్రమ అధికారులకు తెలియజేశారు, మంచిగాలి వచ్చే ఏర్పాట్లు, నూరు ధూళిని తొలగించే సాధనాలు నెలకొల్పబడ్డాయి. డాక్టరు కోరికపైని గ్రైండ్ స్టోన్సుకు, పాలిషింగ్ లేత్‌లకూ సమీపంలో రక్షణతెరలు

పెట్టబడ్డాయి. వెలుతురు ఏర్పాట్లు అభివృద్ధి చేయబడ్డాయి. ఫోర్జ్‌షాపు పునర్నిర్మింపబడింది.

పరిశ్రమకు స్వంత వైద్య ప్రవీణులున్నారు, ఒక సర్జన్, థెరపెటిస్టులు, అక్యూలిస్టులు మొ॥ వైనవారు. చాలాతీవ్రమైన వ్యాధులు పరిశ్రమ వైద్యశాలలో చికిత్స చేయబడతాయి.

గత యుద్ధకాలంలో యీ పరిశ్రమ కార్మిక సంఘంచే నిర్మింపబడిన ఆరోగ్యమందిరంలో మా పరిశ్రమ కార్మికులు విశ్రాంతిని పొందుతారు. ఫాసిజంను ఓడించేందుకు తమ విధిని నెరవేర్చడానికి కార్మికులు చాలీచాలని ఆహార సరఫరా పరిస్థితులలో, కాలాన్నీ, కష్టాలనూ పాటించకుండా పాటుపడ్డారు. వారికి సాయపడేందుకు పరిశ్రమ యజమానులు, కార్మిక సంఘమూ పరిశ్రమలోనే, తమ వ్యయంతో ఒక ఆరోగ్య మందిరాన్ని నిర్మించడానికి నిర్ణయించాయి. ఇందుకోసం అవి ప్రత్యేకంగా ఒక చక్కని గృహాన్ని సంపాదించాయి. వస్తువులనూ, గ్రంధాలయాన్నీ, పుష్కలంగా ఆహారాన్నీ సేకరించాయి....యుద్ధం ముగిసి చాలాకాలం అయిపోయింది, ఆహారం కొరత అన్న సమస్యే లేదు. కాని ఆరోగ్యమందిరం పరిశ్రమలో వుండిపోయింది. అది ప్పుడు యింకోతీరులో పని చేస్తుంది. విశ్రాంతి తీసుకుంటూగాని, ప్రత్యేక చికిత్సను పొందుతూగాని చాలామంది కార్మికులు అక్కడ ఎప్పుడూ కనిపిస్తూ వుంటారు. కార్మిక సంఘం ఆరోగ్య మందిరంలో కార్మికులకు ఒక నెలరోజులదాకా విశ్రాంతికి ఉచితంగా వసతినిస్తుంది. చికిత్స అవసరమైన కార్మికులపట్ల ప్రత్యేకమయిన మైన శ్రద్ధ వహించబడుతుంది. ఆరోగ్య మందిరం పరిశ్రమకు ప్రక్కగా వుండడంవల్ల, కార్మికులు అక్కడికి తమ షిఫ్టు తరవాత నేరుగా వచ్చేస్తారు. ఇక్కడే వారు భోజనం చేస్తారు, డాక్టరు చెప్పిన చికిత్సలను పొందుతారు, విశ్రాంతి తీసుకుంటారు, ఫిల్ములు చూస్తారు, పుస్తకాలు చదువుతారు, తమ కిష్టం వచ్చినవిధంగా కాలక్షేపం చేస్తారు.

క్రాస్ని ప్రొలెతరీ కర్మాగారపు లేతుల అసెంబ్లీ



విప్లవానికిముందర పరిశ్రమ యజమానులు కార్మికుల ఆరోగ్య రక్షణకోసం అదనంగా ఒక కోపెక్కుకూడా ఖర్చు చేయడానికి యిష్టపడేవారు కాదు. కాని నేడు కార్మికుల ఆరోగ్య రక్షణకోసం సోవియట్ ప్రభుత్వం ఖర్చుచేసే ధనం సంవత్సరానికి లక్షలూ, మిలియన్లు రూబుల్లు వుంటుంది, యీ ఒక్క పరిశ్రమకే. కార్మిక సంఘంకూడా యిందుకోసం పెద్ద మొత్తాలు ఖర్చు చేస్తుంది. ఒక ఉదాహరణను చూద్దాం. 1957 సంవత్సరానికి పరిశ్రమ కార్మిక సంఘం బడ్జెటులో, కార్మికుల సౌకర్యాలకోసం సాంఘిక భీమా నిధినుండి 3,758,200 రూబుళ్ళు కేటాయింపబడింది. కార్మికుల, ఉద్యోగుల అనారోగ్యపు సెలవుల కోసం, ప్రసూతి సెలవులకోసం చెల్లింపులకు 2,300 000 రూబుళ్ళు అవుతుంది. అశక్తులకు, వృద్ధులకూ యిచ్చే పెన్షన్లకు కేటాయించిన ధనం 850,000 రూబుళ్ళు; విశ్రాంతి గృహాలలో 315 వసతులకూ, ఆరోగ్యమందిరాలలో 45 వసతులకూ 168,400 రూబుళ్ళు ఖర్చు చేయబడతాయి. 1200 మంది పిల్లలకు వేసవి శిబిరాల నిర్వహణకోసం కార్మిక సంఘానికి 253,000 రూబుళ్ళు అవుతుంది.

నేను బుక్-కీపరును కాను, నేను డాక్టరును. అయినప్పటికీ సోవియట్ ప్రజల ఆరోగ్యాభివృద్ధి నిమిత్తం ఖర్చు చేయబడిన లక్షోపలక్షల రూబుళ్ళ అంకెలను పేర్కొనడం నాకు చాలా ఆనందదాయకమైన విషయం.

## సంఖ్యా వివరణ

1936–1957 మధ్య యీ యంత్రాగారంలో యేర్పాటు చేయబడిన వివిధ కోర్సులకు 18,000 కార్మికులు, ఫోర్మెన్లు, సాంకేతిక నిపుణులు హాజరయ్యారు. 1951–1957 మధ్య 950 మంది ప్రత్యేక సెకండరీ స్కూలు విద్యను అభ్యసించారు. 350 మంది కార్మికులు విద్యాసంస్థలకు హాజరయ్యారు. అందులో అనేకమంది అప్పుడే ఇంజనీరింగ్, సాంకేతిక డిప్లొమాలను పొందారు.

* * *

ఈ యంత్రాగారానికి స్వంత ముద్రణాలయం ఉన్నది. సోవియట్ దేశంలోని ఫ్యాక్టరీల పత్రికల్లో ప్రాచీనమైన వాటిలో ఒకటైన *ద్విగతెల్* (ఇంజన్) 1922వ సంవత్సరంలో ప్రారంభింపబడింది. వందలాది కార్మిక విలేఖరులు యీ పత్రికకు వ్రాస్తుంటారు. ఈ పత్రికగాక అన్ని షాపులలోను గోడ వార్తాపత్రికలు యువజనుల పత్రికలు, హాస్యం పత్రికలుకూడా ఉన్నాయి. జీవితము, పనికి సంబంధించిన ప్రధాన సమస్యలపైన ఈ పత్రికలు సిబ్బంది అభిప్రాయాలను ప్రకటిస్తాయి.

* * *

ఐదవ పంచవర్ష ప్రణాళికా కాలంలో (1951–1955) కార్యక్రమాన్ని విజయవంతంగా కొనసాగించినందుకు యీ యంత్రాగార సిబ్బందికి 1,700,000 రూబుళ్ళ మొత్తం ప్రభుత్వ ప్రీమియంలుగా లభించింది. అందులో సగం భాగం ఉత్తములైన కార్మికులకు ప్రీమియంలు ఇవ్వడానికీ, సాంస్కృతిక అవసరాలకూ, నిత్యావసరాలకు వ్యయం చేయబడింది. మిగిలిన మొత్తం గృహాల నిర్మాణానికీ, కార్మికుల ఇతర అవసరాలకూ వెచ్చింపబడింది.

# మేము కోరేది స్నేహం, యావత్ప్రపంచంతో వర్తకం

## వ్లాదిమిర్ ఎర్మిలోవ్

*ఫిట్టర్, సామ్యవాద శ్రమవీరుడు*

సోవియట్ నౌక "పొబేదా"పైని గత వేసవిలో నేను యాత్రికునిగా యూరప్‌లో పర్యటించాను. నా యాత్రలో ఒక గ్రీక్ రేవులో ఒక వ్యాపారస్తుణ్ని కలుసుకున్నాను. ఆయన ఒక చిన్న ఇంజినీరింగ్ సంస్థకు యజమాని.

"మనం వ్యాపారం చేయాలి" అని ఆ గ్రీసు దేశస్తుడు మనఃపూర్వకంగా అన్నాడు. "మనకది అవసరం. యూరప్ ఆసియాలకు కూడా అవసరం....వాణిజ్యం లేకుండా సంబంధాలను సాధారణ పరిస్థితికి తీసుకరావడంగాని, సంబంధాలను స్థాపించడంగాని అసాధ్యం. ఇది లేకుండా వాదనలూ, ఉద్రిక్తత, యిబ్బందులూ మాత్రమే వుంటాయి. మీ అభిప్రాయమేమిటి?"

నేను ఆయన మాటలతో ఏకీభవించానుకోండి. అంతర్జాతీయ సంబంధాలను దృఢతరం గావించడానికీ, విస్తరింప జేసేందుకూ సర్వదా పాటుపడుతోన్న పరిశ్రమలో నేను పనిని చేస్తూ వుండడం వల్ల, వ్యక్తిగతంగా యీ పరిశ్రమకు జవాబు చెప్పడం నాకు సులభమే. మా పరిశ్రమకు ఖాతాదారులూ, మిత్రులూ ప్రపంచం అంతటా వున్నారనీ, క్రాస్నీ ప్రొలెతరీలో తయారైన యంత్ర పరికరాలు పెకింగ్‌లోనూ, వార్సాలోనూ, బ్యూనోస్-ఎయిర్స్‌లోనూ, బుఖారెస్టులోనూ నడుస్తున్నాయనీ, అమెరికాలోనూ, ఇటలీలోనూ తయారైన యంత్ర పరికరాలతో మా వస్తువులు అంతర్జాతీయ ప్రదర్శనలలో జయప్రదంగా పోటీచేస్తున్నవనీ ఆ గ్రీకు వ్యాపారస్తునితో చెప్పగలిగినందుకు నేను సంతోషించాను.

క్రాస్నీ ప్రొలెతరీ వస్తువులు నేడు చైనాలోనూ, వియత్నాం ప్రజాస్వామిక రిపబ్లిక్‌లోనూ, అర్జంటైనాలోనూ కనిపిస్తాయి.

కొద్దికాలం క్రితం మా పరిశ్రమకు, స్క్రూ-కటింగ్ లేత్‌లకోసం ఒక భారత దేశపు కంపెనీనుండి ఆర్డరు వచ్చింది. ఇవి ఒడెస్సా మీదుగా నౌకపైని పంపబడ్డాయి. ఈ యంత్ర పరికరాలు అక్కడ యిప్పటికే స్థాపింపబడ్డాయి. అక్కణ్నుండి మాకు వచ్చిన వార్తల ప్రకారం అవి బాగా పనిచేస్తున్నాయి.

ఇటీవల బ్యూనోస్-ఎయిర్స్‌లో ఒక పారిశ్రామిక ప్రదర్శనం జరిగింది. మా పరిశ్రమ ఇంజినీరు బోరిస్ జ్వరేవ్, ఆ దూరపు దక్షిణ అమెరికా దేశానికి క్రాస్నీ ప్రొలెతరీ యంత్ర పరికరాలతో బాటుగా వెళ్ళారు. ప్రదర్శనశాలలోని ఒక మందిరంలో పని చేస్తూ ఆయన అక్కడ అనేక నెలలున్నారు. స్వదేశానికి ఆయన తిరిగి వచ్చాక, యిలా చెప్పారు:



సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ సభాపతి శ్రీ కె. ఇ. వొరొషిలోవ్ క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమ కార్మికుడు ఎర్మిలోవ్, వరపవోవ్‌లకు సామ్యవాద శ్రమవీర బిరుద ప్రదాన పత్రాలిస్తున్న దృశ్యం.

"మనం పంపినదానికంటె ఐదురెట్లు యంత్ర పరికరాలను పంపినా, యిదేవిధంగా అవ్వన్నీ అమ్మకం అయిపోయి వుండేవి."

వ్యాపారంకాక, యిటీవల ముఖ్యమైన యితర అంతర్జాతీయ సంబంధాలుకూడా త్వరితగతిని పెంపొందాయి.

ఉదాహరణకు, సుమారు ఒక ఏడాది క్రితం కొందరు చైనీస్ కార్మికులు క్రాస్నీ ప్రొలెతరీకి వచ్చారు. సామగ్రిని మరమ్మత్తు చేయడంలో మా అనుభవాన్ని తెలుసుకోవడానికి, చైనా ప్రజారిపబ్లిక్ మా పరిశ్రమకు వారిని పంపింది ఇంకోవేపున మావాళ్లు చైనాలోని వివిధ నగరాలలో గొప్ప ఉత్సాహంతో పనిచేస్తూవుండేవారు. దూరాన వున్న షెన్యంగ్‌లో (ముక్డెన్) పనిచేయడానికి థెర్మల్ శాఖ ఉప అధిపతి అలెగ్జాండర్ కుర్నకోవ్ తన కుటుంబాన్ని ఒక సంవత్సరం బాటు వదలి వెళ్ళారు. ఆయన, మాపరిశ్రమలోని యితర ప్రవీణులూ, ఆ దేశంలోని పెద్ద యంత్రపరికరాల పరిశ్రమను పునర్నిర్మించేందుకు మా చైనా స్నేహితులకు సహాయం చేస్తున్నారు.

దేశాల మధ్య సహకారానికి ఇంతగానూ ముఖ్యమైన యింకో దాని గురించి చెప్తాను. ప్రతిభాశాలియైన యువక టర్నింగ్ లేత్-ఆపరేటర్ విక్టర్ షుమిలిన్ మా పరిశ్రమలో పనిచేస్తున్నారు. ఆయన, యింకో ముగ్గురు టర్నింగ్-లేత్ ఆపరేటర్లు కుజ్మిన్, మార్కోవ్, స్మిర్నోవ్ కొత్త కోత పరికరాలను డిజైన్ చేసి, యంత్ర పరికరాల యిప్పటి రకాలను ఆధునికం గావించి, యితర లేత్‌ల కోత వేగాన్ని, నేర్పునూ బాగా ఎక్కువచేసిన కొన్ని మార్పులను ప్రవేశపెట్టి మా కోసం ఒక ముఖ్యమైన సాంకేతిక సమస్యను పరిష్కరించారు. షుమిలిన్, ఆయన మిత్రుల కార్యకలాపాలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. తొందర్లోనే షుమిలిన్‌కు చెకోస్లొవేకియా నుండి ఆహ్వానం వచ్చింది. ప్రాగ్ లోహ కార్మికులు ఆయన పని పద్ధతులను స్వయంగా చూసి యింకా బాగా తెలుసుకుందామనుకోవడంవల్ల, వారు తమ మాస్కో మిత్రుణ్ని రమ్మని ఆహ్వానించారు.

షుమిలిన్ చెకోస్లొవేకియాలో చాలా పారిశ్రామిక సంస్థలకు వెళ్ళారు, తన పని పద్ధతులను ప్రదర్శించారు. తరవాత కొద్ది కాలా

(మిగత 17వ పుటలో)

# క్రాస్నీ ప్రొలెతరీ గ్రంధాలయం


**ఎ. మరినీనా-బైకోవా**

*గ్రంధాలయోద్యోగిని*


ను పాత గ్రంధాలయోద్యోగిని, పుస్తకాలమధ్య ఎన్నో సంవత్సరాలు గడిపాను. సోవియట్ కార్మికుల జీవితంలో వాటిస్థానమేమిటో నాకు బాగా తెలుసు. 1952లో, ప్రొలెతరీ పరిశ్రమలోని కార్మికసంఘ గ్రంధాలయంలో (యిదికాక, యీ పరిశ్రమలో యింకా రెండు గ్రంధాలయాలున్నాయి). 9200 గ్రంధాలుండేవి 1200 మంది చందాదారులుండేవారు. ఇప్పుడీ గ్రందాలయంలో 30 వేల పుస్తకాలున్నాయి, 3500 మంది చందాదారులున్నారు.



మా యంత్రనిర్మాతల జీవితంలో పుస్తకాలు ఒక భాగమైపోయాయి.

మా చందాదారుల కార్డులను మీరు చూసినట్టయితే, మీరు కొన్ని చక్కని విషయాలు తెలుసుకుంటారు. మొదటిది, కార్మికులంతా చదువుతారు. ఈ విషయం మీకు తెలిసినదే అయినప్పటికీ, యిది చాలా సంతోషించవలసిన విషయం విప్లవానికి ముందర, చాలా కొద్దిమందిమాత్రమే, ఎక్కువగా ఫోర్మెన్, మా పరిశ్రమలో చదవడమూ, వ్రాయడమూ వచ్చినవారు. ఆ రోజుల్లో పరిశ్రమలో గ్రంధాలయమేదీ లేదన్నది చెప్పనక్కర్లేదనుకోండి. రెండవది పనివారు ప్రపంచ మహాకావ్యాలను ఆసక్తితో చదువుతారు, సకల ప్రజల సమకాలీన సారస్వతాలలో ఎంతో కుతూహలాన్ని చూపుతారు. బీరువాలో ఒక కొత్త పుస్తకం కనిపించినక్షణాన (కార్మిక సంఘ కమిటీ సాలుకు పుస్తకాలు కొనడానికి 20 వేల రూబుళ్ళను కర్చుచేస్తుంది), వెంటనే పాఠకులు బారులుతీరి దానికోసం నిలబడతారు.



క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమలోని గ్రంధాలయ దృశ్యం

తమ షాపులోని తోడి పనివారు, పరిశ్రమ కార్మికులు, ఇంజినీర్లు వ్రాసిన పుస్తకాలను కూడా తరచు చందాదారులు అడుగుతూవుంటారు. ఇటువంటి పుస్తకాలు రానురాను ఎక్కువగా మా గ్రంధాలయంలోనికి వస్తున్నాయి.

క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమ కార్మికులు తమ విశ్రాంతి సమయంలో



పరిశ్రమకు సంబంధించిన రచయితవ్రాసిన మొదటి పుస్తకం 1931 ఆకురాలుకాలంలో ప్రచురింపబడింది. దానిని వ్రాసినది దుస్యా పంతిలేవా, యీ అమ్మాయి అప్పుడు టర్నర్‌గా—పనిచేస్తున్నది. "ఉత్తమోత్తముల అడుగుజాడల్లో" అన్న పేరుతో ఆమె వ్యాసావళిని వ్రాసింది. స్వేచ్ఛతోనూ, ఆనందంతోనూ కూడిన మా కార్మికుల కృషి గురించి, వారి సృజనాత్మక కార్యాలగురించి వ్రాసిన యదార్ధమైన, సులభ రచన లివి.

అప్పటికీ యిప్పటికీ చాలా ఏళ్ళు గడిచాయి, యిటువంటి పుస్తకాలు చాలా ప్రచురింపబడ్డాయి అవి సాంకేతిక, రాజకీయాది సమస్యలకు సంబంధించినవి. మా పరిశ్రమ శతవార్షికోత్సవానికి అంకితమైన ఒక పుస్తకం, మా స్వంత

(మిగత 36వ పుటలో)



క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమ కార్మికుల జాజ్ బ్యాండ్

# మేము కళను, సాహిత్యాన్ని, క్రీడలను ప్రేమిస్తాము

## (క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమ కార్మికులు విరామకాలాన్ని ఎట్లా వినియోగిస్తారు)

## పరిశ్రమలోని నాటకాభిమానులు

**—అలెగ్జాండర్ సురోవెగిన్, సీనియర్ ఫోర్మన్**

"మా పరిశ్రమలో చాలామంది నాటకాభిమానులున్నారు, వారికి నాటకాలూ, గేయ నాటకాలూ చాలా యిష్టం. చాలా ఏళ్లగా మా కార్మికులకు మాస్కో కళా నాటక సమాజం నటులతో బాగా పరిచయముంది. యంత్ర పరికర నిర్మాతలకూ, నట శేఖరులకూ మధ్యనున్న యీ మైత్రి చాలా చక్కని రూపాన్ని పొందింది. నటులు మమ్మలను తమ కొత్త నాటకాల రిహార్సల్సుకూ, తొలి ప్రదర్శనలకూ పిలుస్తారు; ముందుకు తాము ప్రదర్శించబోయే నాటకాలను గురించి, వాటిని ఎలా ఆడాలన్నదానిగురించి మమ్మలను సంప్రదిస్తారు. తరసోవ్, కెత్రోవ్, స్తనిత్సిన్, ఆంద్రోవ్‌స్కయా, బొగొల్యుబోవ్ మొదలైన ప్రఖ్యాత మాస్కో కళా సమాజ నటులు మా యిళ్ళకు తరచు వస్తుంటారు, పరిశ్రమలోని మా శాఖలకుకూడా వస్తుంటారు. మా పరిశ్రమలోని నాటక కేంద్రాలకు యీ నటులు తర్ఫీదు యిస్తుంటారు. యంత్ర పరికరాల శాఖ మాస్కో కళా నాటక సమాజానికి నాటక సమాజం కోసం సామగ్రిని తయారుచేసి సాయం చేస్తూవుంటుంది.

"మేము కళను ప్రేమిస్తాము, మా విరామ కాలాన్ని అందుకు వినియోగిస్తుంటాము. మాలో ఔత్సాహిక నటులు, జానపద నాట్య నర్తకులు, నర్తకీ మణులు, గాయకులు, సంగీత విద్వాంసులు, గారడీ విద్యలు చేసేవారు, కవితా గానం చేసేవారు, యక్షిణీ విద్యలు ప్రదర్శించేవారూ వున్నారు. వారు మాస్కో రంగస్థలాలపైని చాలా సార్లు ప్రదర్శనలిచ్చారు, ఔత్సాహికుల కళా పోటీలలో చాలా బాగా ప్రదర్శించారు.

"మా కార్మికులలోని ఎక్కువ ప్రతిభావంతులు వృత్తి నటులుగా మారిపోయారు. ఉదాహరణకు ఇవాన్ తుర్చెంకో ఒక ఫిట్టర్. పని అయ్యేక యీయన నర్తన కేంద్రంలో రిహార్సలుకు వెళ్ళేవాడు. ఇప్పుడీయన వృత్తి నృత్యనాటక సమాజంలో సభ్యుడు. జానపద నృత్యాలలో ఒంటరిగా చేసే నృత్యాలు చేస్తాడు. ఇంకో యిద్దరు ఫిట్టర్లు దిమిత్రీ ఒర్లోవ్‌స్కీ, కాన్‌స్తంతినా అలెగ్జాంద్రోవ్, బోరింగ్ మెషీన్ ఆపరేటర్ వాలెరీ వినోగ్రదోవ్, యింకా చాలామంది వృత్తి నాటక సమాజాలలో చేరడానికి పరిశ్రమనుండి వెళ్లిపోయారు."

# క్రీడలు కండపుష్టినిస్తాయి..

## —జినైదా మొలొచయేవా, టెక్నాలజిస్ట్

ను సాంకేతిక పాఠశాలలో చదువుతూ వున్న రోజుల్లోనే నాకు క్రీడలంటే యిష్టం. ఇతర విద్యార్థినులతో పాటుగా నేను పరుగెత్తడం, దూకడం అభ్యసించే దానివి, పరుగుపందాలు మొదలైన వాటిలో పాల్గొనేదానిని. నేను యిప్పుడు పరిశ్రమలోని ఒక శాఖలో టెక్నాలజిస్టుగా పనిచేస్తున్నాను. మా పరిశ్రమకు క్రీడారంగంలో



క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమ కర్మాగారావరణలో భోజన విరామకాలం

మంచి పేరు ప్రఖ్యాతులున్నాయి. 1923—24 లోనే యీ పరిశ్రమకు ప్రసిద్ధమైన ఫుట్‌బాల్ జట్లు వుండేవి. యీ క్రాస్నీ ప్రొలెతరీ లోనే కార్మికుల తొలి చదరంగపు జట్టు ఏర్పడింది. అనతోలీ ఇసయేవ్, మిహెయిల్ ఒగొనోవ్, అనతోలీ మస్లొవ్‌కిన వంటి ప్రజాభిమానాన్ని చూరగొన్న క్రీడాకారులు—వీరు యిప్పుడు సోవియట్ దేశపు ఫుట్‌బాల్ జట్టులోనివారు—యిక్కడ పనిచేశారు.

ఆరు వందలమందికి పైగా పరిశ్రమలోని కార్మికులు వివిధ క్రీడల్లో పాల్గొంటుంటారు, పరిశ్రమలోని టార్పెడో క్రీడా సంఘానికి చెందిన వారు, వీరు. వారిలో చాలా మంది ప్రతిభావంతులైన క్రీడాకారులు. డిజైనర్ బోరిస్ పెతుఖోవ్ 100, 200 మీటర్ స్ప్రింట్స్‌లో గొప్ప విజయాలను సంపాదించాడు. ఇంకో డిజైనర్ మిహెయిల్ గ్రెష్నేవ్‌కు, నికొలాయ్ మమయేవ్‌కు—యింకోపెట్టర్—పర్వతారోహణం చేయడమంటే యిష్టం. వీరు కకాసస్‌లోని చాలా పర్వత శిఖరాలను ఎక్కారు. పూర్వపు బోరింగ్ మెషిన్ ఆపరేటరు, యిప్పటి విద్యార్థి అయిన బోరిస్ గుర్బునోవ్ యీ పరిశ్రమ చదరంగపు పోటీలలో గెలుపొందిన వ్యక్తి, డిజైనర్ నికొలాయ్ గలనోవ్, డ్రాట్స్ పోటీలలో విజయుడు. ఆ ఆటలో యీయన మాస్టర్ కాండిడేట్ బిరుదుకు అర్హత సంపాదించుకున్నాడు,

"మాకు పదిహేను ఫుట్‌బాల్ జట్లున్నాయి. యివన్నీ చాలా మంచివి. మాకు మంచు హాకీ, స్పీడ్-స్కేటింగ్, సైక్లింగ్ జట్లు కూడా ఉన్నాయి. ఈ పరిశ్రమ ఒకటోరకం క్రీడాస్థలాన్ని నిర్మించింది. నేను పరుగు, దూకడం శిక్షణ నిస్తుంటాను.

"మా పరిశ్రమలో అన్ని వయసులలోని వారు, వివిధ శాఖల్లో యిప్పుడిప్పుడే పనిజేయడం మొదలుపెట్టిన యువకులు, అందరూ అభిమానించే రష్యన్ ఆట గొరోద్కీ ఆడి కాస్త విశ్రాంతి పొందాలనుకునే వృద్ధ కార్మికులూ ఆటలాడుతారు.
మాకు క్రీడలంటే యిష్టం. అవి కండపుష్టినీ,
ఆనందాన్నీ యిస్తాయి గాబట్టి."





క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమ కర్మాగారోద్యానంలో, విరామకాలంలో టర్నర్లు విక్తర్ ప్రొతసోవ్ (కుడి) నికొలాయ్ వాల్కోవ్ చదరంగం ఆడుతున్నారు. శిక్షణ పొందుతున్న విద్యార్థి వాలెంతిన్ పొచెమయేవ్, ఆట చూస్తున్నాడు

# జీవితానికి పూవులవసరం

—ఫైదొర్ త్ర్యాతోవ్, ఫోర్మన్

"వేసవిలో ప్రతి సాయంకాలమూ మా కార్మికులు చాలా మంది వారాంతపు సెలవులకు నగరం వెలుపలికి వెళ్తారు. కొందరు సరస్సులకు వెళ్తారు చేపలు పట్టడానికి, వేటాడడానికీ, కొందరు వీపులకు సంచులు తగిలించుకుని కాలినడక యాత్రలు సాగిస్తారు. ఇంకా కొందరు—నేనుకూడా—వారాంతాలను గ్రామాల్లోని మా కుటీరాలలో గడుపుతాము.

"నగరానికి వెలుపల కుటీరాలను కట్టుకునేందుకు, చాలామంది మా కార్మికులకు ప్రభుత్వం సాయపడుతోంది. టర్నర్లు, మిల్లింగ్ మెషీన్ ఆపరేటర్లు, ఫోర్మెన్, టెక్నీషియన్లు, మా పరిశ్రమలోని యితరులూ స్పెర్బింకాలో వేసవి మకాంలు కట్టుకున్నారు. ఇది మాస్కోకు కొన్ని డజన్ల కిలోమీటర్ల దూరంలోవున్న ఒక అందమైన తావు.

"సెర్గీ పుచ్కోవ్ కుటీరాన్ని చూసి సంతోషించడానికి నేను తరచు ఆగి నిలబడుతుంటాను. సెర్గీ యీ పరిశ్రమలో ముప్ఫయ్యేళ్ళకు పైగా పని చేస్తున్నారు. ఈయనది పెద్ద కుటుంబం, మొత్తం ఎనిమిదిమంది. ఆయన కుటీరంలో నాలుగు విశాలమైన గదులూ, రెండు వరండాలూ వున్నాయి.

"ఇక్కడ చాలా అద్భుతంగా వుంటుంది. ఆ కొత్త తోటలో చెట్లు గాలికి అల్లల్లాడుతున్నాయి. పూల సువాసనతో గాలి మత్తెక్కిస్తోంది. సెర్గీ పుచ్కోవ్‌కు, ఆయన భార్యకూ, పిల్లలకూ పూలంటే చాలా యిష్టమనీ, వాటిని పెంచడం వారికి తెలుసుననీ స్పష్టమవుతోంది. వారి స్థలం, పూలను ప్రేమించేవారికి కనులపండువుగా వుంటుంది.

"పైతోర్ దెమిదోవ్‌కు చెందిన యింకో చక్కని కుటీరం కూడా వుంది. ఈయన దీర్ఘానుభవజ్ఞుడైన పేటర్న్-మేకర్, యిప్పుడు పరిశ్రమలో ఒక శాఖకు అధిపతి. దెమిదోవ్ కుటుంబంకూడా ఒక అద్భుతమైన పళ్ళతోటనూ, బెర్రీ పళ్ళ మడినీ నాటింది. వారి పూల తోటలో చాలా లిల్లక్‌లూ, గంగరావిపూలూ, త్యులెరోసెస్‌లు, లిల్లీలూ వున్నాయి.

కర్మాగారావరణలో పూలచెట్ల నాటుతోన్నదృశ్యం



టెక్నీషియన్ స్లెల్లీ గొర్బునోవా కర్మాగారావరణలోని మడిలో నాట్లకు పూల మొక్కలు కడుతున్నది



"పూలంటే తనకు ఎందుకు యిష్టమో వివరిస్తూ పైతోర్ దెమిదోవ్ "జీవితానికి పూవులవసరం. పూవులు అందచందాలు, కార్మికునికి యివి ప్రతిపాత్రమైనవి" అని అన్నారు.

"నేనుకూడా ఒక కుటీరాన్ని నిర్మించుకోవడం మొదలుపెట్టాను, అదింకా తయారుకాలేదు. కాని నేను పళ్ళతోటను నాటడం పూర్తి చేశాను, పువ్వులు పూస్తున్నాయి. నిజం చెప్పాలంటే యింతకు నేను ఎన్నడూ మా పిల్లల వృక్షశాస్త్రపు పుస్తకాలను చూడలేను. కాని చెట్టు ఎలా పెరుగుతుంది, అనుకోకుండా శీతోష్ణస్థితి పడిపోతే పువ్వులకు ఏమి సంభవిస్తుంది అన్న విషయాలు తెలుసుకోవడానికి యిప్పుడు చూస్తుంటుంటాను. మొక్కలంటే యిష్టాన్ని, (కాసి) (పొలెతరి యే మాకు కలిగింది. శాఖల కట్టడాలున్న చోటనే, పరిశ్రమ ఆవరణలో అద్భుతమైన తోట. పూల పొదలూ వున్నాయి. అవి ప్రక్కగావుంటే, ఇంకోవిధంగా పనిచెయ్యబుద్ధవుతుంది, ఎక్కువ ఉల్లాసంగా నిపుణంగా."

# అఖిల సోవియట్ దేశ ప్రాచ్యభాషా విశారదుల సమావేశం

అఖిల సోవియట్ దేశ ప్రాచ్య భాషా విశారదుల ప్రథమ సమావేశం యిటీవల, ఉజ్బెకిస్తాన్ ముఖ్యపట్టణం తాష్కెంట్‌లో జరిగింది. ఈ సమావేశంలో పాల్గొనడానికి సోవియట్ దేశం నకల ప్రాంతాల నుండి 250 మంది ప్రవీణులు వచ్చారు.

విముక్తికొరకు భారతీయ ప్రజలు సాగించిన పోరాటాలగురించి ప్రొఫెసర్ రైస్నెర్ చేసిన ప్రసంగాన్ని సభాసదులు చాలా ఆసక్తితో విన్నారు. సర్వస్వతంత్రమైన భారత రిపబ్లిక్ నేడు అగ్రరాజ్యాలలో స్థానాన్ని సంపాదించుకోవడానికి అర్హతను పొందిందనీ వలస విధానానికి వ్యతిరేకంగానూ, శాంతికొరకూ,—విభిన్నసాంఘిక— ఆర్థిక వ్యవస్థలుగల దేశాల మధ్య శాంతియుత సహజీవనం కొరకూ చేస్తోన్న తన కృషి ద్వారా గొప్ప పలుకుబడిని సంపాదించుకున్న దనీ ఆయన ఉద్ఘాటించారు.

1857-1859 మధ్య జరిగిన భారతదేశ స్వాతంత్ర్య మహో సమరానికి కారణాలను, దర్శకత్వాన్నీ, ఫలితాలనూ డోసెంట్ ఎ. ఒసిపోవ్ శాస్త్రీయ దృష్ట్యా చర్చించి, సకల అభ్యుదయకాముక మానవ జాతితోబాటుగా సోవియట్ ప్రజలు జరిపే యీ తిరుగుబాటు యొక్క శతవార్షికోత్సవం దృష్ట్యా ముఖ్యంగా చాలా విలువైన తోగట్టాను యిచ్చారు.

ఉజ్బెకిస్తాన్ ప్రభుత్వం, ఆ రిపబ్లిక్కులో ప్రాచ్య విద్యా పరిషత్తును నెలకొల్పడానికి నిర్ణయించిందని, ఆ సమావేశం తొలిరోజున ప్రకటింపబడింది.

సోవియట్ ప్రాచ్యవిద్యాధ్యయన యితోధికాభివృద్ధికీ, సోవియట్ దేశ ప్రజలకూ, ప్రాచ్య దేశాల ప్రజాలకూ మధ్యగల అభేద్యమైన మైత్రిని దిట్టపరిచేందుకూ, యీ సమావేశం చాలా తోడ్పడుతుంది.

తాష్కెంటులో జరిగిన అఖిల సోవియట్ దేశ ప్రాచ్యభాషా విశారదుల ప్రప్రథమ సమావేశ దృశ్యం



# మేము కోరేది స్నేహం, యావత్ప్రపంచంతో వర్తకం

(12వ పుట తరువాయి)

నికి ప్రాగ్, బ్రాటిస్లావా, బ్రనో, ప్లజెన్ టర్నింగ్ లేత్ ఆపరేటర్లు మాస్కోకు వచ్చారు. మాస్కో వాసుల విజయాలను పరిశీలించారు. యిటువంటి పరస్పర సహాయమూ, బోధన అవసరమనీ, ఉపయోగకరమనీ ప్రకటించారు.

మా సంభాషణలో దీనినంతట్నీ నేను గ్రీకు వ్యాపారస్తునికి చెప్పాను. ఆయన ప్రశ్నకు యిది నా జబాబు. ఆఖరున నేను ఆయనకు చెప్పినదానిని యిప్పుడు మరల చెప్పడం, అనుచితం కాదనుకుంటాను.

"సకల ప్రజలతోనూ, సకలదేశాలతోనూ మిత్రులుగా వుండాలనీ, వ్యాపారం చేయాలనీ మా అభిలాష. ఇందుకు మాకు చాలినన్ని విస్తృతావకాశాలున్నాయి. గ్రీసు, భారతదేశం, చైనాలతోనూ, యితర ప్రదేశాలలోనూగల ఏ పరిశ్రమకైనా క్రొత్త ప్రొపెల్లర్ ఒకటోరకం యంత్ర పరికరాలను యివ్వగలదు. మనం వ్యాపారం చేయాలి, బలమైన వ్యాపార సంబంధాలు నెలకొల్పబడాలి. హైడ్రోజెన్ బాంబుకంటె వీటికి ఎక్కువ శక్తి వుంది. ప్రజల అండ వున్నందున, యీ సంబంధాలకు మంచి భవిష్యత్తుంది."



# శాంతి ప్రయోజనాలకు అణుశక్తి వినియోగం

## సోవియట్ దేశానికి ఎటువంటి అంతర్జాతీయ సహకారం కావాలి?

విజ్ఞానశాస్త్రం, ఇంజినీరింగులలోని వివిధ రంగాలలోను, వ్యవసాయం, పరిశ్రమలు, వైద్యం మొదలైన వాటిలోను అణుశక్తిని విస్తృతంగా వినియోగించడానికి అప్పుడే అపారమైన అవకాశాలు యేర్పడ్డాయి. విద్యుచ్ఛక్తి మూలాధారాలు తగినంతగా లేని దేశాలకూ, ఆర్థికంగా బాగా అభివృద్ధిపొందని దేశాలకూ ఇది గొప్ప ప్రాముఖ్యతను కలిగి వుంటుంది. కాని ప్రస్తుతం కొన్ని దేశాలు



మాత్రమే, ఆర్థికాభివృద్ధి కొరకు అణుశక్తి వినియోగానికి సంబంధించిన క్లిష్టమైన సమస్యలను పరిష్కరించగల స్థితిలో వున్నాయి: అణుశక్తి ప్రత్యక్ష ప్రయోగానికి అనేకమంది సుశిక్షితులైన ప్రవీణులు, మొదటి తరగతి సాంకేతిక స్థావరమే గాక బ్రహ్మాండమైన మొత్తాల ప్రాథమిక ఖర్చులుకూడా అవసరమవుతాయి.

ఇలాంటిపరిస్థితులలో, శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తి వినియోగం విషయంలో అంతర్జాతీయ సహకారము, ఈ రంగంలో తమ పనిని సమన్వయ పరిచేందుకు వివిధ దేశాల మధ్య సమిష్టి కృషి, అవసరమైన దేశాలకు తగు సహాయం చేయడము తప్పనిసరి అవుతున్నదని స్పష్టంగా తెలుస్తుంది. అలాంటి సహకారం పెంపొందడం నిస్సందేహంగా, అత్యంత ఉపయోగాన్ని, ప్రాముఖ్యతను కలిగి వుంటుంది.

**యన్. ఆర్క్యద్యేవ్**

దురదృష్టవశాత్తు, ఇతరరంగాల్లో విధంగానే యీ రంగంలోకూడా పాశ్చాత్యరాజ్యాల మధ్య రూపొందుతూన్న సంబంధాలను "సహకారం" అని నిర్వచించడానికి యేమాత్రమూ వీలులేదు. కొన్ని పాశ్చాత్య దేశాలకు అమెరికా చేస్తున్న "సహాయం", అంతర్జాతీయ సహకారోద్దేశాన్ని పెడమార్గాన్ని పెట్టడం తప్ప మరేమీకాదని వాస్తవ విషయాలు తెలియజేస్తున్నాయి.

ఇతర దేశాల్లో శాంతియుత ప్రయోజనాల కొరకు అణుశక్తి వినియోగం విషయంలో జరుగుతున్న పనిపైని అమెరికాయొక్క నిరాటంకమైన కంట్రోలును స్థాపించడము, ఆ దేశాలు యే విజయాలను సాధించినా, యేదో కొద్ది లంచం ఆశచూపి వాటిని అమెరికన్ గుత్త వ్యాపారులకు ఉపయోగపడేటట్లు చూడడమే యీ సహాయంయొక్క ఉద్దేశ్యం.

పశ్చిమ జర్మన్ ప్రముఖ రాజకీయవేత్తల ప్రకటనలను గమనించినట్లయితే ఈ హేయమైన పనిలో భాగాన్ని పొందడానికి ఆ దేశ గుత్త వ్యాపారులుగూడా ప్రయత్నిస్తున్నారని తెలుస్తుంది. "యురాటం" ద్వారా, పశ్చిమ యూరపులో జరిగే అణుశక్తి ఉత్పత్తిలో ఆధిక్యతా స్థానాన్ని సంపాదించి, ఈ రంగంలో తమపై వున్న నిర్బంధాలన్నింటిని (ఉదాహరణకు సైనికావసరాలకై పశ్చిమ జర్మనీ అణుశక్తిని వినియోగించరాదని నిషేధించే ప్యారిస్ ఒడంబడికలు) తప్పించుకోడానికీ, క్రూర అణ్వాయుధాల ఉత్పత్తికి బాహాటమైన అవకాశాన్ని సంపాదించడానికి పశ్చిమ జర్మన్ సైనిక వాదులూ, ప్రతీకారాపేక్షకులు ప్రయత్నిస్తున్నారు.

ఈ సైనికోద్దేశాలు వుండడంవల్లనే సోవియట్ దేశం "యురాటం" యేర్పాటుకు వేసిన పథకాలను బలపర్చలేకపోయింది. బహిరంగమైన యిలాంటి సైనికోద్దేశాలకు భిన్నంగా సోవియట్ దేశం, సమస్తదేశాల సమానత్వానికి హామీనిచ్చి, సమస్తదేశాల సర్వసత్తాధికార ప్రాతిపదికపై వుండి, మిత్రరాజ్యసమితి చార్టర్ సూత్రాలన్నింటికి అనుగుణ్యంగా వుండేటట్టి సహకారాన్ని కోరుతున్నది. ఈ ముఖ్యాతిముఖ్యమైన రంగంలో దేశాల సహకారం, కొన్నిదేశాల భద్రతకు హాని కలిగించకుండా వుండి, ఇతరదేశాలకు కొన్నిదేశాలుచేసే సహాయము రాజకీయ, ఆర్థిక, సైనిక స్వభావంగల డిమాండులపై ఆధారపడకుండా వున్నప్పుడు మాత్రమే ఫలవంతమవుతుందని సోవియట్ దేశం అభిప్రాయ పడుతున్నది.



ఈ ఉద్దేశాల ననుసరించే సోవియట్ దేశం, శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తిని వినియోగించే పరిశోధనల అభివృద్ధిలో ఇతర దేశాలకు వైజ్ఞానిక, సాంకేతిక, పారిశ్రామిక సహాయాన్ని చేకూర్చడానికి 1955 జనవరిలో నిశ్చయించుకొన్నది. చైనా ప్రజారిపబ్లిక్,



చెకొస్లొవాకియా, పోలెండ్, రుమేనియా, బల్గేరియా, హంగరీ, జర్మన్ ప్రజాస్వామ్య రిపబ్లిక్, యుగోస్లావియా, ఈజిప్టు దేశాలు ఇట్టి సహాయాన్ని పొందుతున్నాయి. శాంతియుత ప్రయోజనాలకొరకు అణుశక్తి వినియోగం విషయంలో ఇతరదేశాలకు గూడా సహాయం చేయడానికి సోవియట్ దేశం సిద్ధంగా వున్నది.

సోవియట్ దేశం చొరవతో 1956 మార్చిలో మాస్కోలో జరిగిన కొన్ని యూరోపియన్, ఆసియా దేశాల సమావేశం ఫలితంగా సమిష్టి అణు పరిశోధనా సంస్థ స్థాపింపబడింది. ఈ సంస్థ నిబంధనల ప్రకారం, దాని పనిలో పాల్గొన అభిలషించే యే దేశమైనా దానిలో సంపూర్ణ సభ్యత్వాన్ని పొందవచ్చును. ఈ ప్రముఖ వైజ్ఞానిక కేంద్రంలో పన్నెండు యూరోపియన్, ఆసియా దేశాలకు సంబంధించిన విజ్ఞాన శాస్త్రవేత్తలు పనిచేస్తున్నారు.

యూరోపియన్ ఆర్థిక సహకారానికి సంబంధించిన సాధారణ సమస్యలు, పరిష్కారం, ఇతర యూరోపియన్ దేశాలకు వ్యతిరేకంగాఉండే కొన్ని యూరోపియన్ దేశాల కూటములు కొందరికి మాత్రమే సభ్యత్వం ఉండేట్టు నిర్మించే సంస్థల సృష్టిపైన ఆధారపడి ఉండరాదని సోవియట్ దేశం అభిప్రాయపడుతున్నది. ఇందువల్లనే అది, శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తి వినియోగం విషయమై ఒక సాధారణ యూరోపియన్ సంస్థ స్థాపనను గురించి చర్చించడానికి యూరోపియన్ దేశాల సమావేశం జరుపబడాలని 1956 జూలైలో ప్రతిపాదించింది. ఈ సంస్థ, అంతర్జాతీయ అణుశక్తి ఏజన్సీ యొక్క మాండలిక శాఖగా ఉంటుందని సోవియట్ దేశం భావించింది.

1957మార్చి 18వ తేదీన సోవియట్ దేశం సాధారణ యూరోపియన్ ప్రాతిపదికమీద అణు పరిశోధక సంస్థ, లేదా సంస్థల స్థాపన సమస్యను, పారిశ్రామిక, వైజ్ఞానిక, సాంకేతిక అవసరాలకొరకు అణుశక్తి ఉత్పాదక యంత్రాగారాలను స్థాపించడం విషయంలో యూరపియన్ దేశాల సహకార సమస్యను ఆ యంత్రాగారాలకు ముడిసరుకులను అందజేయడం సమస్యను పరిశీలించడానికి ప్రతిపాదనను చేసింది.

1957 ఏప్రిల్, మే మాసాలలో జరిగిన మిత్రరాజ్యసమితి యొక్క యూరోపు ఆర్థిక కమిషన్ సమావేశంలో సోవియట్ దేశం అనేక ప్రతిపాదనలను చేసింది. రెండు యూరోపియన్ అంతర్జాతీయ పరిశోధనా కేంద్రాలమధ్య—సమిష్టి అణు పరిశోధనా సంస్థ, జెనీవాలోని యూరోపియన్ అణుపరిశోధనా కేంద్రం—వైజ్ఞానిక సమాచార ఆదాన ప్రదానం, గురించి నది అందులో మొదటి ప్రతిపాదన, అణుపారిశ్రామిక యంత్రాగారాలను స్థాపించడం వాటికి ముడిపదార్థాలు సరఫరా చెయ్యటం విషయమైకూడా ప్రతిపాదన చేయబడ్డది.

అంతర్జాతీయ అణుశక్తి ఏజన్సీ అనే కొత్త అంతర్జాతీయ సంస్థ యొక్క చార్టర్‌ను సోవియట్ దేశం అన్ని దేశాలకంటే ముందుగా ఈ సంవత్సరం ఫిబ్రవరి 8వ తేదీన ఆమోదించింది. శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తి వినియోగం సమస్యకూ, సమస్త దేశాల ప్రజల మధ్య సహకారాన్ని పటిష్టం చేయడం విషయానికి సోవియట్ దేశం యెంత ప్రాముఖ్యత నిస్తుందో యీ విషయమేగట్టిగా రుజువు చేస్తుంది.

శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తి వినియోగం కొరకు గట్టిగా పాటుపడుతూనే, సోవియట్ దేశం, అణు, ఉదజని ఆయుధాల నిషేధంకొరకు నిర్విరామంగా కృషి సల్పుతున్నది. ఈ ఆయుధాల నిషేధం అంతర్జాతీయ విశ్వాసాన్ని పటిష్టం చేయటమేగాక, విస్తృతమైన వస్తు, వైజ్ఞానిక, సాంకేతిక మూలాధారాలు మారణ ఆయుధాల నిర్మాణానికి ఉపయోగపడకుండా, అణుశక్తి మానవ శ్రేయస్సుకు ఉపయోగింపబడేటట్లు చేయడానికి కూడా తోడ్పడుతుంది.



# మాస్కో టెలివి
# భారత

[ మా వి

ఒకవేసవి సాయంకాలం సుమారు ఏభై లక్షలమంది మాస్కో లోనూ, దాని పరిసరాలలోనూ వున్న టెలివిజన్ ప్రేక్షకులు తమ టెలివిజన్ సెట్లు మీట తిప్పినప్పుడు, "భారతదేశపు వ్యంగ్యం, హాస్యం" అన్న శీర్షిక టెలివిజన్ సెట్టుమీద కనిపించింది.

భారత శాస్త్రీయ సంగీత శ్రుతులు వినిపించాయి. దేవతాకథలో వలె తెల్లని పొగలెగసే ఒక పాత్ర తెరమీద కనిపిస్తుంది. తెల్లని భారతీయ వస్త్రాలు ధరించి యిద్దరు ఆ పాత్రపైకి వంగివున్నారు. ఒకరు సంస్కృతంలో సరస్వతీ స్తవం చేశారు. ప్రత్యేకంగా టెలివిజన్ కార్యక్రమం కోసం రచించిన ప్రార్థనలో ఆయన తరవాత, యింకొకరు చదివారు:

*"ఓ సరస్వతీ, మా మనవి విను,*
*మా భావాలను ఉన్నత పథాలకు ఎగిరించు!*
*నీ దివ్య మహిమా జ్యోతిచే*
*మా నాటక శోభను వెలిగించు,*
*ప్రేక్షకులు మా దేశ ప్రతిభను*
*గ్రహించునట్లనుగ్రహించు.*
*విముఖవు కాబోకు సరస్వతీ,*
*నేడు టెలివిజన్ తేజోవిహీనమైతే,*
*మేము ఆనందాన్నివ్వలేకపోయిన*
*మాస్కో వాసుల అశాంతిని హరించ*
*దేవీ! మమ్ములను దీవించు!"*

దేవి వారి మనవిని వింది. మాస్కో టెలివిజన్ స్టుడియోకు వచ్చిన లేఖలనుబట్టి, యీ విషయం తెలుస్తుంది. ఈ ప్రసారం అందరికీ ఆనందాన్నిచ్చింది.



## తొలి ప్రయత్నం కాదు

కాని మాస్కో టెలివిజన్ కేంద్రం టెలివిజన్ తెరపైని భారతీయ కార్యక్రమాన్ని ప్రదర్శించడం; యిది తొలిసారికాదు. నవంబరు నెలలోనే టెలివిజన్ అభిమానులు "*నవరత్నాలలో ఒకరు*" అన్న రచనను చూశారు. ఇది కాళిదాస మహాకవి గురించి చేసిన రచన. ఈ కార్యక్రమం ఎంతో ఆనందాన్నివ్వడం వల్ల, మాస్కో టెలివిజన్ ప్రేక్షకులకు యింకో భారతీయ కార్యక్రమాన్నివ్వడానికి, కార్యక్రమ నిర్వాహకులకు ఉత్సాహం కలిగింది. ఇందుకోసం వారు మాస్కోలోని భారత రిపబ్లిక్ రాయబార కార్యాలయాన్నీ, యిక్కడ నివసిస్తోన్న భారతీయులనూ ఒక కార్యక్రమాన్ని తయారు చేయడంలో సహాయపడమని కోరారు.

"దేనితో ప్రారంభించడం?" అన్నది మొదటి ప్రశ్న.

---

మాస్కో టెలివిజన్ కేంద్రం "భారత దేశపు వ్యంగ్యం, హాస్యం"అన్న కార్యక్రమాన్ని ప్రసారం చేసిన సందర్భాన, సోవియట్ దేశంలోని భారత దేశపు తాత్కాలిక ఉప రాయబారి శ్రీ రత్నం, టెలివిజన్ ప్రేక్షకుల నుద్దేశించి ప్రసంగిస్తోన్న దృశ్యం. ఛాయాచిత్రాలు: వా. గుద్కోవ్

# జన్ తెరమీద
# దేశం

రేఖరి ]

"అందరికీ అర్ధమయ్యే జానపద హాస్య వ్యంగ్యాలతో!" అని జబాబు వచ్చింది.

## మామ్మ నీకేమిటి చెప్పింది?

ఎవ్వరూ, యింతకు ముందెన్నడూ చూడని దానిని చూపాలను కున్నాము. భారత దేశానికి ఎన్నడూ వెళ్ళక, భాషకూడా రాకపోయి నట్టయితే చేయడానికి యిది తేలికైన పనేమీకాదు.

కాబట్టి భావి భారతీయ కార్యక్రమ కర్తలు, రాయబార కార్యాల యంలోని వారు చాలామందితో బాటుగా శ్రీ రత్నంగారి కార్యాలయంలో చిన్న మేజా చుట్టూరా కూచున్నారు. ఎప్పుడో తాము విన్నదానిని జ్ఞాపకం తెచ్చుకుని చెప్పడానికి, రాయబార కార్యాలయోద్యోగులు చాలా ప్రయత్నించారు. తమ్ము సంప్రదించడానికి వచ్చినవారు మాటిమాటికీ చేసే విజ్ఞప్తులకు, వారిలో కొందరికి చాలా చిరాకు కలిగి వుండవచ్చును. "మీ బాల్యంలో మీ అమ్మ, మామ్మ, లేకపోతే యింకెవరైనా చెప్పిన దానిని జ్ఞాపకంతెచ్చుకోవడానికి దయచేసి ప్రయత్నించండి. హాస్యంగా వుండిన విషయాలను, మిమ్ములను నవ్వించిన విషయాలను జ్ఞాపకం తెచ్చుకోండి." మా భారతీయ మిత్రులు శాయశక్తులా ప్రయత్నించి, తమ కథలను ఉన్నదున్నట్టుగా చెప్పారు; తాము చెప్పదలుచు కున్న దానిని చెప్పడానికి భాష సరిపోనప్పుడు వారు సౌంజ్ఞల తోనూ, పెన్సిలుతో బొమ్మలు వ్రాసి ప్రయత్నించారు. ఈ విధంగా తొలి సాయంత్రం టెలివిజన్ ప్రసారంకోసం ఏడు నీతికథలూ, హాస్యాలూ, గాధలూ సేకరింపబడ్డాయి. సోవియట్ దేశంలో ప్రచు రింపబడిన భారతీయ కథాసంకలనాలద్వారా, వీటిలో కొన్ని టెలివిజన్ ప్రేక్షకులకు పరిచయమైనవే. అయినా, కొన్ని అందరికీ కొత్తవే.

## నటులూ, దుస్తులూ

వస్తుసేకరణ, పనిలో సగంమాత్రమే దీనినంతట్నీ ప్రదర్శ నకు తగువిధంగా ఏర్పరచడమూ, యీ భారతీయ హాస్యంలోని జాతీయతనూ, అపూర్వతనూ సంపూర్ణంగా పోషించడమూ అవసరం. సోవియట్ ప్రేక్షకులకు భారతీయ జానపద హాస్యంలోని ప్రతిభ అవ గాహన అయ్యేటట్టు చేయడానికి, మార్గాన్ని కనుగొనాలి.

ఇదికూడా తేలికైన పనేమీకాదు, ముఖ్యంగా తయారు కావ





విధంగా నటులసమన్య జయప్రదంగా పరిష్కరింపబడింది. చాలా భాగం అలంకరణలూ, అనేక దుస్తులూకూడా పుష్కిన్ నాటక సమాజం నుండి తెచ్చుకోబడినవే.

## నిజమైన భారతీయులు

భారతీయ సంగీతం లేకుండా భారతీయ జానపద హాస్యం వుండగలదా? అసంభవం!

వెచ్చని ఒక వేసవి రోజున యీ కార్యక్రమ కర్తను, నిర్మాతను భారతీయ సంగీతాన్ని వినడానికి శ్రీమతి కమలారత్నం ఆహ్వా

దానికి వ్యవధి కొద్దిగా వుండడంవల్ల.

నటుల గురించి, దుస్తుల గురించి తొందర్లోనే నిర్ణయం జరిగిపోయింది. మాస్కో పుష్కిన్ నాటక సమాజం శూద్రకుని "మృచ్ఛ కటిక"పై ఆధారపడి వ్రాసిన "తెల్ల కలువ" ఒక సంవత్సరానికి పైనుండీ జయప్రదంగా ప్రదర్శిస్తోంది. ఈ నాటకానికి సంబంధించిన జాతీయతను, దాని భావాన్ని సమర్థులైన నటులు, ఈ నాటకసమాజం వారి అద్భుతమైన వస్తుజాలమూ చక్కగా పరిపోషించాయి. ఇందు వల్ల మాస్కో టెలివిజన్ కేంద్రం, "తెల్లకలువ" నటులను చాలామందిని, యీ టెలివిజన్ కార్యక్రమాలలో పాల్గొనేందుకు ఆహ్వానించింది. భారతీయ విషయాలతో పరిచయంగల వీరు తేలికగా శైలిని కనుగొని, త్వరలోనే చక్కని భారతీయ జాతీయ పాత్రలను సృష్టించారు.

వీరు రష్యన్ నటులనీ, భారతీయ నటులుకారనీ చాలామంది మా ప్రేక్షకులు నమ్మలేకపోయారు. ఈ



"విధేయురాలైన భార్య" అన్న భారతీయ నాటకంలోని ఒక దృశ్యం. పాత్రధారులు పుష్కిన్ ప్రదర్శనాలయ నటులు ఇజ్విక్, కోతెన్



నించారు. వారు అక్కడికి వెళ్ళాక మేజామీద వందలకొలదీ రికార్డులు కనిపించాయి. భారతీయ సంగీతం గురించి తమకు తెలిసినది అత్యల్పమని వారు అంగికరించవలసివచ్చింది.

శ్రీ రత్నం, శ్రీమతి రత్నం వివిధ రాగాల స్వభావాన్ని, వస్తువునూ వివరించి, ఉపయోగింపబడిన సంగీతవాద్యాలను వర్ణిస్తూ వారికి సహాయపడ్డారు. ఆ తరవాత పని బాగా సాగింది. ఈ కార్యక్రమానికి నిజమైన జాతీయత రావడం మొదలైంది. అయినా నిర్మాతకు పూర్తిగా సంతృప్తికలుగలేదు. దీనిలో జాతీయత కొరతపడిందని, ఈ కార్యక్రమంలో నిజమైన భారతీయులు పాల్గొనాలని ఆయన ఉద్ఘాటించారు. "నిజమైన" భారతీయులుకూడా దొరికారు. విద్యార్థులు పరాస్కర్, చక్రవర్తి, ముఖర్జి కార్యక్రమంలో పాల్గొన్నారు. వారు పాల్గొనడం

నటులుగా మాత్రమేకాదు. శ్రీమతి రత్నంతో బాటుగా వారు, యీ కార్యక్రమానికి కర్తలు కూడాను.

## టెలివిజన్ ప్రేక్షకులు చూసిన దేమిటి?

రష్యన్ భాషలో ఒక గొంతుక, కాని బలమైన బెంగాలీ ఉచ్చారణ. అది యిలా ప్రకటించింది: *"ఇబ్బంది కలిగించే ఆగంతకులు"*.

అప్పుడు ప్రేక్షకులకు యిద్దరు మొండివాళ్ళయిన ఆగంతకులు కనిపించారు, జబ్బుతోవున్న తమ మిత్రుణ్ని చూడడానికి వస్తూ. తమ కబుర్లతో ఆ జబ్బుమనిషికి విసుగెత్తించి వాళ్ళక్కడ చాలా సేపు బైఠాయించారు. ఇందువల్ల అతని జబ్బు యింకా ఎక్కువై పోయింది.

ఆ జబ్బుమనిషి తన శ్రేయోభిలాషులకిచ్చిన మంచి సలహాను ప్రేక్షకులు మరిచిపోరనుకుంటాము। ఆయన సలహా ఇలాయిచ్చాడు: "జబ్బుమనిషిని చూడడానికి వచ్చి శుభాకాంక్షలను అందజేయాలనుకుంటే, అతని తలకాయలోనూ, కడుపులోనూ నొప్పివచ్చేటంత సేపు అక్కడ వుండిపోవద్దు." ఇది చెప్పి ఆ జబ్బుమనిషి అలసిపోయి వెనకకు పడిపోయాడు, సిగ్గుపడిన తన తెలివి తక్కువ స్నేహితుల ఎదుట.

ఈ ప్రదర్శనం అయిపోయాక, రంగం మీద తెల్లపూల పాత్ర కనిపించింది. "విధేయురాలైన భార్య" అని వెనుకనుండి ఒక గొంతుక ప్రకటించింది.

కాని ఆ భార్య ఎక్కువ విధేయురాలు కాదని తరవాత తేలిపోయింది. ఆమె భర్త చనిపోయినట్లు నటించగానే, ఉందా—ఆమె పేరది—, తనను పెళ్ళి చేసుకుంటానన్న భర్త స్నేహితునికోసం భర్త ముక్కుకోసి వెయ్యడానికి సిద్ధపడింది.

తెరమీదికి మళ్ళీ పాత్ర వచ్చింది, దాని లోగంలోనుండి ఒక కొత్త రంగం కనిపిస్తుంది.

టెలివిజన్ ప్రేక్షకులు తన భవిష్యత్తును తెలుసుకోలేక, యితరుల భవిష్యత్తును చెప్పే బూటకపు జ్యోతిష్యులను చూసినవ్వుకున్నారు, ఒకపేదవాణ్ని క్రూరంగా అవమాన పరచిన లోభిని అసహ్యించుకున్నారు, బీర్బల్ హాస్యానికి సంతోషించారు, తుంటరి వ్రాయసకాడు గోపాల్ భార్ కొంటెపనులను చూసి ఆనందించారు.

ఈ ప్రదర్శనలు ఒకొక్కటీ—కొద్ది నిమిషాలకు మించనివి—భారతీయుల ప్రపంచ జ్ఞానాన్ని వెల్లడిచేశాయి. సరైన భారతీయ దుస్తులు, అద్భుతమైన సంగీతం, నటుల కృషి, భారతీయాలంకారాలు, బయటనున్న వెచ్చని మాస్కో సాయంత్రమూ కలసి దూరంగా వున్నప్పటికీ, నానాటికీ ఎక్కువగా పరిచయమవుతోన్న భారత దేశాన్ని ప్రేక్షకులకు చేరువగా తీసుకవెళ్ళాయి.





ప్రదర్శనలో పాల్గొన్న భారతవిద్యార్థులు (ఎడమనుంచి కుడికి)
ఎం. పటాన్కర్, జి. చక్రవర్తి, జడ్. ముఖర్జీ





ఎకడమీషియన్ ఆంద్రీ తుపొలేవ్

# సోవియట్ విమాన నిర్మాత

ఎన్. కనెవ్‌స్కి

సామ్యవాద శ్రమవీర బిరుదాంకితుడైన ఎకడమీషియన్ ఆంద్రీ తుపొలేవ్‌కు, సోవియట్ దేశంలో విమానాల డిజైనింగ్‌లో గొప్ప విజయాలను సాధించినందుకు లెనిన్ బహుమానం యివ్వబడింది. సోవియట్ దేశ వైమానిక శాఖ యింకా రూపొందుతున్న సమయంలో యీ రంగంలో అతని జీవితం ప్రారంభమయింది. రష్యాలో అంతర్యుద్ధం అతి ఉధృతంగా ఉన్నప్పుడు, 1918 డిసెంబరు మాసంలో లెనిన్ సలహాపైన సెంట్రల్ ఏయిరో-హైడ్రోడైనమిక్ ఇన్‌స్టిట్యూట్ (త్సాగి) యేర్పాటు చేయబడింది. ఇక్కడే తుపొలేవ్ డిజైనర్‌గా తన జీవితాన్ని ప్రారంభించారు. విధ్వంసం గావింపబడిన ఒక మహాదేశం ప్రజలు ధైర్యంతో అత్యంత కష్టతరమైన దశను దాటుతున్న సమయమది. కర్మాగారాలలో పనిచేయడానికి యంత్రాలేవీ లేని రోజులవి, కాని ప్రజలు అధైర్యపడలేదు. పాటలు పాడుకొంటూ, చలోక్తులు విసురుకొంటూ పనులు చేసుకుపోతుండేవారు. మంచిరోజులు వస్తాయనీ, ఆనాడు తాము కలలోనైనా ఊహించజాలని పరిస్థితులను ప్రభుత్వం చేకూర్చుతుందనీ వారు నమ్మారు.

వారి ఆశలు ఫలించాయి. వైమానిక విషయాల్లో పరిశోధనలు జరిపేవారికి "త్సాగి" ఇప్పుడు ప్రధాన కేంద్రంగా ఉంటున్నది. ఈ సంస్థ పరిశోధనాలయాల్లో అనేక ముఖ్యసమస్యలు పరిష్కరింపబడుతున్నాయి. ప్రభుత్వం తుపలేవ్ డిజైనింగ్ ఆఫీసుకు అత్యాధునికమైన యంత్ర-పనిముట్లను, ప్రెస్‌లను, కంట్రోలు, కొలత పరికరాలను చేకూర్చింది. ఏదైనా ఒక ఆలోచన రాగానే దానిని గురించి వెంటనే పరిశోధనలు జరుపవచ్చును.

వైమానిక శాఖ రవాణాకు సంబంధించిన విషయాలంటే తుపొలేవ్‌కు యెక్కువ ఆసక్తి ఉన్నది. ఆయన మొట్టమొదటగా తయారుచేసిన నమూనా, క్రీడలపోటీల్లో ఉపయోగించే విమానానికి సంబంధించినది. రెండవది, ఒక వైమానికుడు, ఇద్దరు ప్రయాణీకులు కూర్చోడానికి వీలుగావుండే ఎ. ఎన్. టి-2 విమానం. ఆటుతర్వాత ఆయన దేశం యావత్తు దృష్టికి వచ్చిన ఎ.ఎన్.టి-9 ప్రయాణీకుల విమానం. క్రిల్యా సొవెతోవ్ (సోవియట్ల రెక్కలు) అని ఆ విమానానికి నామకరణం చేయబడింది. 1929లో ఈ విమానం యూరపులోని అనేక దేశాల రాజధానులకు విజయవంతమైన ప్రయాణాన్ని చేసింది. 1931లో తుపొలేవ్ డిజైను చేసిన మరొకవిమానం, ఎ.ఎన్.టి-14, సోవియట్ విమానం సర్వీసులో ఉపయోగానికి తీసుకురాబడింది. అనేకమంది ప్రయాణీకులను తీసుకువెళ్ళగల విమానాన్ని తయారు చేయడానికి జరిగిన తీవ్రప్రయత్నమే ఇలా ఫలించింది. విమానం నడిపేవారైదుగురుకాక మరి 36 మంది ప్రయాణీకులను కూడా తీసుకువెళ్లగలదీ విమానం. ఆ రోజుల్లో ఇంతమంది ప్రయాణీకులతో విమానం యెగరడమంటే గొప్ప విశేషమే.

పెద్ద విమానాలను తయారుచేయాలన్న భావాలలో విమానాలు తయారుచేసే డిజైనర్లు నిమగ్నమైపోయిన కాలం ఒకటి వచ్చింది. అన్ని దేశాలలోని విమానాల నిర్మాతలు 50, 80, 100 మందికూడా ప్రయాణం చేయగల విమానాలను తయారుచేయడానికి తలలు బ్రద్దలు కొట్టుకొనసాగారు. ఒకదాని తర్వాత ఒకటిగా బ్రహ్మాండమైన పథకాలు తయారుచేయబడ్డాయి. కాని సరియైన ఇంజన్ లేకపోవడం మూలాన వాళ్ళపథకాలు కార్యరూపం దాల్చలేకపోయాయి. విమానాలు డిజైన్ చేయడం పనిలో ఇంజన్ కెపాసిటీ వెనకపడుతూవచ్చింది. 39 మీటర్ల ఫ్యూసిలేజ్, నమ్మశక్యం కానంతటి పొడవైన—96 మీటర్ల—రెక్కలు ఉండే విమానాలకు యీ ప్రింటులు. ఇతర వివరాలు తయారయ్యాయి. లేకపోతే యెక్కువగా ఉండవలసిన ఇంజన్లకు, ఇంధనం టాంకులకు స్థలం చాలదు. కాని అందవిహీనమైన రెక్కలుగల "గ్యాస్ కారీయర్లు" పైకి లేవనేలేకపోయాయి. అందువల్ల బ్లూ ప్రింట్లన్నీ రాబోయే తరం వారికి ఉదాహరణలుగా ఉండగలిగేందుకు భద్రంగా దాచిపెట్టబడ్డాయి.

ఆ సమయంలో తుపొలేవ్ అంతకుముందు యెక్కడా కనీవినీ యెరుగని బరువును మోసే కెపాసిటీ గల ఒక విమానాన్ని తయారు చేశారు. విమానాల చరిత్రలో ఎ.ఎన్.టి-20 గా ప్రఖ్యాతిగాంచిన ఈ విమానం 1951 వరకు ప్రపంచంలోకల్లా పెద్ద విమానంగా గుర్తింపబడుతూ వచ్చింది. తుపొలేవ్ తయారుచేసిన మరికొన్ని నమూనాలు కూడా ఆయా రకపు విమానాల్లో చాలాకాలంవరకు అత్యుత్తమమైనవిగా వుంటూవచ్చాయని ఈ సందర్భంలో చెప్పవలసి వుంటుంది. ఆటు తర్వాత ఆయన తయారు చేసిన ఎ.ఎన్.టి-35 రకం విమానంలోనే, విమానాల చరిత్రలో ఒక నూతన శకాన్ని, అత్యంత వేగంగాపోయే విమానాల శకాన్ని వ్యక్తం చేసే అంశాలు కనబడ్డాయి. ఎ.ఎన్.టి-35

దానియొక్క అందాన్ని బట్టీ, గంటకు 350 కిలోమీటర్ల వేగంతో ఏకబిగిని 1,500 కిలోమీటర్ల దూరం ఎగర గల శక్తినిబట్టి అందరి ఆదరణనుపొందింది. ఈనాటి ప్రమాణాలతో పోల్చి చూచినట్లయితే ఇదేమంత గొప్ప విశేషం కాదన్నమాట నిజమే. కాని ఇరవై సంవత్సరాల క్రితం అది మానవ మేధస్సుయొక్క ఒక బ్రహ్మాండమైన విజయంగా పరిగణింపబడేది, విమానం పైభాగం నునుపుగా వుండడం వల్ల దాని వేగం హెచ్చుతూందన్న విషయాన్ని వ్యక్తంచేసింది యీ విమానమే. పైకి కనబడకుండా వుండే రివిట్లు యేమంత ముఖ్య విషయాలు కావనిపించవచ్చు. కాని విమానం పైభాగంమీద "తలలు" బయటికి కనబడుతూ వుండే రివిట్లకంటే ఇలాంటి రివిట్లు విమానం యొక్క వేగం హెచ్చడానికి తోడ్పడతాయి. కాలం గడిచిన కొద్ది వేగం హెచ్చించడం విషయంలో డిజైనర్లు కొత్తవిషయాలను కనుగొన సాగారు,

దేశభక్తి ప్రపూరిత మహాయుద్ధం మూలంగా ప్రయాణీకుల విమానాల విషయంలో తుపొలేవ్‌యొక్క సంస్థ జరుపుతున్న పనికి ఆటంకం యేర్పడింది. కాని యుద్ధ భీభత్సం సమసిపోయిన తర్వాత విజయవంతులైన సోవియట్ ప్రజలు తమ శాంతియుత కృషికి తిరిగీ పూనుకున్నారు,

ఒకసారి మాకు ఒక విమానాల ఉత్పత్తి యంత్రాగారంలో 70 మంది ప్రయాణీకులను తీసుకొని దూరపు ప్రయాణం చేయగల ఒక విమానం చూపబడింది. ప్రయాణీకుల కవసరమైన సౌకర్యాలన్నీ—వెనకకు వంగే కుర్చీలు, గుడ్డలు పెట్టుకోడానికి అరలు, వేడినీళ్ళు, చల్ల నీళ్ళు లభించే ముఖాలు కడుగుకొనే గదులు, సామానుల గదులు—వుండేటట్లుగా యేర్పాటుచేసారు డిజైనర్లు. సంవత్సరం పొడుగునా అందమైన విమానం ఊర్ధ్వవాయుమండలం సరిహద్దులోపయనించవలసి వుంటుంది గాబట్టి గాలి లోపలికి చొరకుండా వుండేటట్లు చేయబడింది. దాని పైభాగం, లోపలిభాగంలో యెల్లప్పుడు మామూలు గాలి వత్తిడి. శీతోష్ణస్థితి వుండేటట్టు యేర్పాట్లుచేయబడ్డాయి. ఆ విమానమే ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన టి. యు. 104 ప్రయాణీకుల జెట్ విమానం.

దీనిని గురించి దేశీయ పత్రికల్లోను, విదేశ పత్రికల్లోను చాలా వ్రాయబడింది. అయినప్పటికి, డిజైనర్ తుపొలేవ్ యొక్క సృజనాత్మక పరిశోధనాలయం వెల్లడించే కొన్ని ముఖ్యమైన వివరాలు ఇంతవరకు తెలుపబడలేదు. ఉదాహరణకు టి.యు-104 విమానం ఇంజన్‌ను నడిపించడం విషయం తీసుకొందాము: పైలెట్ ఒక మీటను నొక్కుతాడు. స్టోరేజ్ బ్యాటరీ పనిచేయడం ప్రారంభిస్తుంది. తర్వాత ఒకదానితో మరొకటి సంబంధాలను కలిగివున్న యంత్రాలు స్వయంచలన పద్ధతిలో నడవడం మొదలుపెడతాయి. ఒకటిన్నర నిమిషంలో—వేసవికాలమేగాని, శీతకాలమేగాని—విమానం నడవడం ప్రారంభిస్తుంది. సాంకేతిక బృందానికీ, పైలెట్లకు యీ విమానం నడపడమంటే యెంత ఆనందంగావుంటుంది!

ఆసక్తిదాయకమైన మరొక విషయంవున్నది: పైలెట్ జెట్ విమానంయొక్క బ్రహ్మాండమైన చక్రాన్ని చేతితోనే త్రిప్పుతాడు, స్టీరింగ్ చక్రానికి, టెయిల్ గ్రూపుకూ డురాల్యుమిన్‌తో తయారుచేసిన ఒక కడ్డీతో సంబంధం కలపబడి వుంటుంది. ఇలాంటి పద్ధతివల్ల ఇతర దేశాల్లో వుపయోగింపడే పద్ధతికంటే నమ్మకంగా పని జరుగుతుందనీ, నడపడంకూడా సులభమనీ తుపొలేవ్ అభిప్రాయ పడుతున్నారు. ఇందులో యేర్పాటు చేయబడిన ప్రత్యేకమైన హైడ్రాలిక్ యాంత్రిక విధానం సహాయంతో పైలెట్ స్టీరింగ్ చక్రాన్ని సులభంగా త్రిప్పగలడు. అవి బిగుసుకుపోయి నడవడం మానేస్తే యేమయ్యేట్టు? అలాంటప్పుడు యెంతటి బలవంతుడు కూడా స్టీరింగ్ చక్రాన్ని చేతితో కదిలించలేడు!

విమానాశ్రయంలో మేము నిలబడి విమానం యెలా భూమిమీద నడుస్తుందో చూచి మెచ్చుకొన్నాము. సమర్థుడైన డ్రైవర్ నడుపుతున్న మోటారులాగ మృదువుగా వెళ్ళిపోతూ కనబడింది. బ్రహ్మాండమైన ఆ విమానం—టి.యు-104—బయలుదేరుతున్న ధ్వనిలో మా మాటల ధ్వని మునిగిపోయింది. రెక్కల వెనుకనుండి వస్తున్న వేడి వాయు ప్రేషాన్ని తప్పించుకొనేందుకు మేము ప్రక్కకు తిరిగాము. ఇది అనవసరమైన జాగ్రత్తను తీసుకొనడం కాదు. జెట్ విమానం యొక్క వాయు ప్రేషం తుఫాను గాలికంటే మించిన ఉద్ధృతాన్ని కలిగి వుంటుంది. నగరాలు, గ్రామాలమీదుగా వెళ్ళేటప్పుడు 200-250 మీటర్ల కంటే తక్కువ యెత్తులో యెగరటానికి వీలులేదు. లేకపోతే ఇండ్ల కిటికీలు తుత్తునియలై పోతాయి.

ఆధునిక విమానాలు అల్యూమినియమ్, మెగ్నీసియమ్, క్రోమిలోమ్, నికెల్, మోలిబ్డినమ్, బెరిల్యుమ్, ఏయోబియన్, వనాడియమ్, టిటానియమ్‌ల మిశ్రమంతో తయారు చేయబడుతున్నాయి. సింతటిక్ రబ్బర్, ఆప్టిక్ అద్దాలు, ఎలెక్ట్రానిక్ పనిముట్లు, ఆటో పైలెట్లు, టెలీ మెకానిక్‌లు, టెలివిషన్ గూడా విమానాల్లో ఉపయోగింపబడుతాయి. మొట్టమొదటి వర్తులస్తంభాకారపు ప్రయాణీకుల విమానం ఎ.ఎన్.టి-2ను తుపొలేవ్ "పూర్తి" డురాలుమిన్‌తోనే తయారు చేసారు. ఆయన తయారుచేసిన మొట్టమొదటి జెట్ ప్రయాణీకుల విమానం టి.యు-104 కూడా ఒక క్లిష్టమైన మిశ్రమంతో నిర్మింపబడ్డది. ఈ రెండు విమానాలు తయారైన కాలం మధ్య విజ్ఞాన శాస్త్రాభివృద్ధిలో దేశం ఒక చారిత్రక శకాన్ని అధిగమించింది.

ఆంద్రీ తుపొలేవ్ తాను సాధించిన విజయాలను గురించి తలుచుకొంటూ గర్వపడుతూ కూర్చొనక, సోవియట్ దేశ విమానాలను ఇంకా వృద్ధిలోకి తీసుకురావడానికి, టి.యు-104 విమానంలో కంటే యెక్కువమంది ప్రయాణీకులు పట్టే విమానాన్ని డిజైను చేయడానికి నిర్విరామంగా కృషి సల్పుతూవచ్చారు. తత్ఫలితంగా ఆయన నాయకత్వంలో పనిచేస్తున్న బృందం 180 మంది కూర్చొనే నాలుగు ఇంజన్ల టర్బోజెట్ "రొస్సియా" విమానాన్ని డిజైను చేసింది. అవి త్వరలో సోవియట్ విమాన ఉత్పత్తి యంత్రాగారాలలో నిర్మింపబడబోతున్నాయి. ఈ కొత్త విమానం గంటకు తొమ్మిదివందల కిలోమీటర్ల వేగంతో పయనించగలదని తెలుస్తున్నది.

భవిష్యత్తులో నిర్మింపబడబోయే టి. యు. విమానాలు 200 మంది ప్రయాణీకులతో యెగరడం సాధ్యం కావచ్చును.





యెవ్‌గెనీ

తులా మాస్కోకు 200 కిలోమీటర్ల దూరములోవున్న ఒక ప్రాచీనరష్యా నగరం బహుకాలంగా అది లోహపు చేతి పనివారికి, ఉక్కు పనివారికి, తుపాకులు చేసేవారికి ప్రసిద్ధికెక్కింది. స్వయంకృషివల్ల పని నేర్చుకున్న ఇలాంటి ఒకచేతి పనివానిని గురించే ప్రఖ్యాత రష్యా రచయిత నికొలాయ్ "లేష్టి" అను పేరుతో ఒకప్రజారంజకమైన కథను వ్రాశారు.

తులా, దాని ప్రజల జీవితంయొక్క ఇతర అంశాలను గురించికూడా రష్యా సాహిత్యములో అనేక కథలు—విషాదకరమైనవి, గంభీరమైనవి—వున్నాయి. గ్లెబ్ ఉస్పెన్స్కి తులా కార్మికుల కష్టమయ జీవితాన్ని చిత్రించారు. తులలో స్థానిక ఫ్యాక్టరీలను సందర్శించిన తర్వాత, అక్కడ కలిగిన భావాలను వెల్లడిస్తూ "ఇది నిజంగా అవసరమేనా?" అన్న శీర్షికతో లియో టాల్‌స్టాయ్ ఒక వ్యాసాన్ని వ్రాశారు

వైస్ దగ్గర, భగభగమండుతూ వుండే లోహం కలిగించే మూసలదగ్గర చేసే అతికష్టమైన పన్నెండు గంటలపనీ, చాలీచాలనితిండీ తులా కార్మికులను త్రాగుబోతులయ్యేటట్లు చేస్తుండేవి తమ కష్టాలను ఈవిధంగా మరిచిపోవడానికి ప్రయత్నిస్తూ. ఆ త్రాగుడు మూలాన ముప్ఫై సంవత్సరాలనాటికే అశక్తులై పోయేవారు. తులాలోని మరణాల సంఖ్య రష్యాదేశం అంతట్లోకి యెక్కువగా వుండేదని, విప్లవాత్పూర్వపు సంఖ్యా వివరాలు తెలుపుతున్నాయంటే అందుకు కారణం లేకపోలేదు

బహుశ ఇందుకే కాబోలు, నగరానికి సంబంధించిన పూర్వపు విషయాలు తెలిసినవారు, ఇప్పుడా నగరవీధుల్లోను, ఫ్యాక్టరీలవద్ద కనబడే ఆరోగ్యవంతులు, ఉత్సాహవంతులు అయిన ప్రజలను చూచి ఆశ్చర్యపడుతుంటారు. గత నలభై సంవత్సరాలలో నగరమే కాకుండా, ప్రజలుకూడా పూర్తిగా మారిపోయారు.





"కాని దీనికి, క్రీడలకూ సంబంధమేమిట"ని యెవరైనా అడుగవచ్చు బహుశ ప్రజలు ఇప్పుడు పూర్వంవలె పన్నెండుగంటలు పనిచేయనవసరం లేకుండా, చక్కనిపని పరిస్థితుల్లో ఎనిమిది గంటలే పనిచేస్తుండడంవల్లా, నగరంలో డజన్లకొలది హాస్పిటల్‌లు వుండడంచేత, కూలిపోతున్న మురికి ఇండ్లకు బదులుగా విశాలమైన చక్కని ఆరోగ్యవంతమైన ఇండ్లల్లో నివసిస్తుండడం చేత ఆరోగ్యవంతులుగాను, బలమైనవారుగాను తయారవుతున్నారేమో. అవును, అదంతానిజమే.

కాని తులా డాక్టర్లను ఈ విషయాన్ని గురించి అడగండి. తులాపౌరులు ఆరోగ్యవంతులుగాను, చురుకైనవారుగాను కావడానికి వ్యాయమంలోను, క్రీడలలోను ఇవ్వబడిన క్రమబద్ధమైనశిక్షణ వారికి ఎంతగా తోడ్పడిందో డాక్టర్లు తెలియజేస్తారు.

## క్రీడల నగరం

క్రీడలంటే శ్రద్ధ చూపనివారిని తులాలో చూడడం సాధ్యంకాదు. అన్నిటికంటె

# క్రీడాకారుల నగరం

షత్రోవ్





యేది ఆకర్షవంతమైన క్రీడ అన్న విషయంలో మాత్రమే భేదాభిప్రాయం కనబడుతుంది.

బహూశ, సైకిల్ పందాల క్రీడలలో పాల్గొనేవారు అంరటికంటే అత్యధిక సంఖ్యాకులుగా వుండవచ్చు. ఈ సైకిల్ పందాలకొరకు తులాలో చక్కని బాటలు వున్నాయి. ఇక్కడ సైకిల్ పందేలలో పాల్గొనే వారిలో ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన వారేగాక, ప్రతిభావంతులైన యువకులు గూడా వున్నారు. సెకెండరీ స్కూలు విద్యార్థి సాషా ఫలేయేవ్ (ఛాయా చిత్రంనెం 1)కు, తనకు భిమాన విషయమైనరసాయనిక శాస్త్రం తర్వాత, సైకిల్ పందాలంత ఇష్టమైన విషయం మరేదీలేదు సైకిలింగ్ క్రీడలోని జ్యూనియర్ల విభాగంలో సమర్థుడు, కష్టపడి కృషి చేసేవాడు అయిన సభ్యుడీతడు, కొద్ది సంవత్సరాల లోపల పెద్ద ఛాంపియన్‌గా తయారవ్వాలని అతడు కలలు కంటున్నాడు. ఈలోగా అతడు నగరంయొక్క జూనియర్ల సైకిల్ క్రీడలలో ఛాంపియన్ బిరుదుని పొందాడు.

నెం. 2 నెం. 3 ఛాయాచిత్రాలలో సాషాలాగనే క్రీడల్లో పాల్గొనే పెద్దవారు అగుపడుతారు. క్రీడల విభాగంలో వారు అనేక సంవత్సరాలుగా శిక్షణను పొందుతున్నారు. ఎంతటి అనుభవంవున్న క్రీడాకారులైనా శిక్షణను, క్రీడలకు సంబం







ధించిన సిద్ధాంత అధ్యయనాన్ని ఆపజాలరు. వారికి శిక్షణనిచ్చే క్రీడల ప్రవీణుడు వ్లాదిమీర్ కుజ్నెత్సోవ్, తన ఇతర పనులతోపాటు సైకిల్ పోటీ జట్లను యేర్పాటుచేసే పనినికూడా చేస్తుంటాడు. కొత్తగా వచ్చిన అనేకమంది జూనియర్లు సైకిల్ పోటీ జట్లలో చేరాలని కుతూహలపడుతుంటారు. డాక్టర్ నీనా దొన్‌చెంకో వారిని అత్యంత శ్రద్ధతో పరీక్షిస్తుంది. "నువ్విక వ్యాయామ క్రీడలలో పాల్గొనవచ్చును" అంటుందామె ఒక యువ క్రీడాకారునితో, "నీ గుండె, ఊపిరితిత్తులు చక్కని స్థితిలో వున్నాయి." (ఛాయాచిత్రం నెం. 4.)

పరుగుపందాలలో పాల్గొనేవారంతా షక్త్యోర్ (గని) క్రీడాసంఘం స్టేడియంలో సమావేశమవుతారు. ఈ పోటీలలో మధ్య అడ్డంకులు ఉండే పందెం అన్నిటికంటే కష్టమైనది. ఇందులో పాల్గొనేవారికి గొప్ప సహనశక్తి, బలము, ప్రావీణ్యత అవసరము. వారు తమ ప్రతి యొక్క కదలికలోను శ్రద్ధ చూపవలసి ఉంటుంది (ఛాయాచిత్రం నెం. 6).

"గోల్"—కొసొగోర్స్కి ఇనుము, ఉక్కు కర్మాగారానికి చెందిన యీ యువతీయువకులు యెంత సంతోషంగా ఉన్నారు (ఛాయాచిత్రం నెం. 7) వారి ఫుట్‌బాల్ జట్టు గెలుస్తున్నది. కాని, అక్కడ మధ్య కూర్చున్న వ్యక్తికి ఆశాభంగం కలిగినట్టున్నది. బహుశ, ఓడిపోతున్న జట్టుకు చెందినవాడేమో.

"షక్త్యోర్," "డైనమో" క్రీడల సంఘాలకు చెందిన జట్లమధ్య ఆట బాస్కెట్‌బాల్ కోర్టులో (ఛాయాచిత్రం నెం 8) జరుగుతున్నది. ఇంకా ఈ జట్లు బాగా ప్రావీణ్యతను పొందలేదు. అందువల్లే ప్రేక్షకులు అధికంగా లేరు. అయినప్పటికి ఆ జట్లలోని యువతులు అత్యంత ఉత్సాహాన్ని ప్రదర్శిస్తూనే ఆడుతున్నారు.

"జెనీత్" క్రీడల సంఘం వారికి నేడు పోటీ ఆటలేదు. అయినప్పటికి వారు శిక్షణకొరకు ఊరకనే ఆడుతున్నారు (ఛాయాచిత్రం నెం 9). ఫుట్‌బాల్ పోటీలు ఉధృతంగా కొనసాగుతున్న సమయమిది గాబట్టి, కాలాన్ని వృధా చేయడానికి వీల్లేదు.

మేము తులాలో అనేక క్రీడల క్లబ్బులను సందర్శించాము. కాని ఇంకా యెన్నెన్ని చోట్ల క్రీడలు కొనసాగుతున్నాయనుకున్నారు! నగరంలో అనేకమంది ప్రముఖ క్రీడాకారులున్నారు; మోటారు పందేలలో పాల్గొనేవారు, చదరంగం ఆటగాళ్లు (గ్రాండ్‌మాస్టర్ అలెగ్జాండర్ కోతోవ్ తన ఆటను ఇక్కడే ప్రారంభించారు). కుస్తీలు పట్టేవాళ్లు, టెన్నిస్ ఆటగాళ్ళు మొదలైనవారు యెందరెందరో వున్నారు. తులాలో వున్నవారిలో ప్రతి ఐదవ వ్యక్తి క్రీడల్లో పాల్గొంటుంటాడు అక్కడ వున్న అన్ని ఫ్యాక్టరీలలోను, 50 పాఠశాలలు, తదితర విద్యాసంస్థలలోను క్రీడల విభాగాలున్నాయి.

## అనేకుల్లో ఒకడు

కాని తులా యావత్తు సోవియట్ దేశానికి క్రీడల కేంద్రమన్న భావాన్ని మేము కలిగించబోవడం లేదు. అలా కానేకాదు. అది సర్వసాధారణమైన—అంత పెద్దదికూడా కాదు—ప్రాంతీయకేంద్రం దేశంలో ఇలాంటి పట్టణాలు డజన్లకొలది ఉన్నాయి. ఈ పట్టణపు క్రీడాజీవితానికీ, దేశంలో ఇతరప్రాంతాలలో, ఐవనోవ్ నగరం, జార్జియాలోని కుతైసి, రష్యా సమాఖ్యలోని ఓర్యోల్, ఉజ్బెకిస్తాన్‌లోని సమర్‌ఖండ్ నగరాలలోని క్రీడా జీవితానికి యేమీ తేడా కనబడదు

అవును. ప్రజలందరు క్రీడల్లో విస్తృతంగా పాల్గొనే దేశమైన సోవియట్ దేశంలో వున్న అనేక క్రీడల నగరాల్లో తులాకూడా ఒకటి.





# మా పాఠకులు అడిగిన ప్రశ్నలు

*ప్రశ్న: పాఠశాలలో ఏ తరగతివరకు, లేదా విశ్వవిద్యాలయములో ఏ సంవత్సరంవరకు సోవియట్ దేశంలో విద్య ఉచితంగా బోధింపబడుతుంది? విద్యా సంస్థలలో విద్యార్థులకుగల సౌకర్యాలేమిటి?*

జవాబు: సోవియట్ దేశంలో అన్ని రకాల సాధారణ పాఠశాలలలోనూ, ఉన్నత విద్యాసంస్థలలోనూ, సెకండరీ ప్రత్యేక పాఠశాలలలోనూ విద్యార్థులకు విద్యాబోధన ఉచితం. ఉన్నత విద్యా సంస్థలలోనూ, సెకండరీ ప్రత్యేక పాఠశాలలలోనూ సహాయం అవసరంగల విద్యార్థులందరికీ నెలవారీ ప్రభుత్వ విద్యార్థి వేతనమూ, హాస్టలులో వసతి లభిస్తాయి. అన్ని విద్యాసంస్థలలోనూ గ్రంథాలయాలూ, పఠనమందిరాలూ వున్నాయి. వీటిలో గ్రంథాలూ, పాఠ్య పుస్తకాలూ విద్యార్థులు ఉచితంగా వాడుకోవచ్చును. విద్యా సంస్థల్లో ఆహారశాలలూ, అల్పాహారశాలలూ వున్నాయి. వీటిలో విద్యార్థులకు ఆహారం స్వల్పధరలకు దొరుకుతుంది. బోర్డింగ్ పాఠశాలల పద్ధతి నానాటికీ ఎక్కువగా వ్యాప్తిలోనికి వస్తోంది.

*ప్రశ్న: సోవియట్ దేశంలో ఇంగ్లీషు భాష బోధింపబడుతోందా? సోవియట్ దేశంలో ఎన్ని విదేశీ భాషలు బోధింపబడుతున్నాయి?*

జవాబు: విదేశీ భాషల అధ్యయనంపట్ల సోవియట్ దేశంలో ఎంతో శ్రద్ధ తీసుకోబడుతోంది. ఐదవ పాఠం నుండి విదేశీ భాషలు బోధింపబడుతున్నాయి, సెకండరీ ప్రత్యేక పాఠశాలలలోనూ, ఉన్నత విద్యాసంస్థలలోనూ వీటి బోధన సాగుతోంది. సోవియట్ విద్యార్థులు విధిగా ఒక విదేశీ భాషను చదువుతారు, రెండో భాషను నేర్చుకోవడం ఐచ్ఛికం. భాషల విద్యాసంస్థలలోనూ, విశ్వవిద్యాలయాల భాషా శాఖలలోనూ, ఫాకల్టీలలోనూ విద్యార్థులు రెండు మూడు విదేశీ భాషలు కూడా నేర్చుకుంటారు.

ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచి భాషలు సెకండరీ పాఠశాలలలోనూ, విద్యాసంస్థలలోనూ అభిమాన భాషలు. ఇటీవలి సంవత్సరాలలో ఇంగ్లీషు అన్నిటికంటె ఎక్కువగా అభిమానాన్ని పొందింది.

*ప్రశ్న: సోవియట్ దేశంలో హిందీ బోధింపబడుతుందా? ఈ భాషను నేర్చుకోవడానికి విద్యార్థులు ఆసక్తిని చూపుతున్నారా?*

జవాబు: మాస్కో ప్రభుత్వ విశ్వవిద్యాలయంక్రింద ప్రాచ్య భాషల విద్యాసంస్థవుంది. దీనిలో విద్యార్థులు హిందీతో బాటుగా వివిధ ప్రాచ్యభాషలను చదువుతారు. మాస్కో విశ్వవిద్యాలయంలోని ఆర్థిక, భూగోళ శాస్త్రశాఖలలోనూ, యింకా చాలా విద్యా సంస్థలలోనూ, మాస్కోలోనూ, మధ్యఆసియా రిపబ్లిక్కులలోని కొన్ని సెకండరీ పాఠశాలలలోనూ కూడా హిందీ చదువుతారు. విద్యార్థులు యీ భాషను గొప్ప పట్టుదలతోనూ, ఆసక్తితోనూ చదువుతారు.

*ప్రశ్న: సోవియట్ దేశంలో మాట్లాడబడే భాషలెన్ని? ప్రభుత్వ భాష ఏది? జాతీయభాష కాక సోవియట్ దేశంలో అధికారపూర్వకంగా గుర్తింపబడిన ప్రాంతీయ భాషలెన్ని వున్నాయి?*

జవాబు: వివిధ భాషా కుటుంబాలకు చెందిన 200 భాషలకుపైగా సోవియట్ దేశంలో ఉన్నాయి. అవ్వన్నీ అధికారపూర్వకంగా గుర్తింపబడినవే, అవి సమానమైనవి. సోవియట్ దేశంలో ఒక ప్రభుత్వ భాషగాని, జాతీయ భాషగాని లేదు. ప్రతి ప్రజకు, ప్రతి జాతికీ విప్లవానంతరం నుండీ చదువుకోవడానికీ, తమ పత్రికలనూ, నాటక కళలనూ పెంపొందించుకోవడానికీ, తమ భాషలోనే న్యాయ విచారణలను నడుపుకోవడానికీ అవకాశం లభించింది. సోవియట్ రాజ్య కాలంలో స్వంత లిపి లేని డజన్ల కొలది జాతులకు ఇప్పుడు స్వంత లిఖిత భాషలున్నాయి; తమ భాషలలో వారు మంచి సారస్వతాలను సృష్టించుకున్నారు.

*ప్రశ్న: పట్టం పుచ్చుకున్న తరవాత, సోవియట్ దేశంలో విద్యార్థులకు ఏ డిగ్రీలు లభిస్తాయి?*

జవాబు: సోవియట్ దేశంలో విద్యార్థులకు తమ పట్ట పరీక్షల తరవాత విజ్ఞానశాస్త్రంలో డిగ్రీలు దొరకవు. విజ్ఞానశాస్త్రంలో బిరుదులు (డోసెంట్, ప్రొఫెసర్), విజ్ఞానశాస్త్రంలో డిగ్రీలు (మాస్టర్ ఆఫ్ సైన్స్, డాక్టర్ ఆఫ్ సైన్స్) ఉన్నత విద్యాసంస్థలకు వైజ్ఞానిక పరిశోధనా విద్యాసంస్థలకు చెందిన పండితసభల నిర్ణయానుసారంగా విజ్ఞానశాస్త్రంలో కృషి చేస్తున్నవారికీ, కళాశాలల ఉపన్యాసకులకూ యివ్వబడతాయి. ఉన్నత విద్యా సంస్థలలో పట్టం పొందేవారికి, వారు పొందిన అర్హత ననుసరించి ఇంజినీరు, సెకండరీ పాఠశాల ఉపాధ్యాయుడు, డాక్టర్ మొదలైన డిప్లొమాలు లభిస్తాయి.

*ప్రశ్న: సోవియట్ దేశంలో ఎన్ని విశ్వవిద్యాలయాలున్నాయి? వాటన్నిట్లో పురాతనమైనదేది?*

జవాబు: సోవియట్ దేశంలో 35 విశ్వవిద్యాలయాలున్నాయి. వాటి మొత్తం విద్యార్థుల సంఖ్య 178,000. 1955 లో ప్రభుత్వ విశ్వవిద్యాలయాలలోని విద్యార్థుల సంఖ్య, విప్లవానికి పూర్వపు సంఖ్యకు 5.3 రెట్లు అధికం.

మాస్కో లొమొనోసోవ్ ప్రభుత్వ విశ్వవిద్యాలయం, సోవియట్ దేశంలో అన్నిటికంటె పురాతనమైనది, పెద్దది. దానిలో 62 శాఖలు, 210 ఆచార్యపీఠాలూ వున్నాయి; వీటిలో 22 వేలమందికి పైగా చదువుకుంటున్నారు. వారిలో సోవియట్ దేశ ప్రజలలోని 70 జాతులకు చెందినవారు, పలు విదేశాల విద్యార్థులు వున్నారు.

ఉన్నత విద్యాసంస్థలలో వున్నవి విశ్వవిద్యాలయాలు మాత్రమే కాదు; ఇన్‌స్టిట్యూట్లు, అకాడమీలు మొదలైనవి కూడా వున్నాయి.

# చెకొస్లొవాకియాలో సోవియట్ పార్టీ, ప్రభుత్వ ప్రతినిధివర్గం

ఈ మధ్య నికితా కృశ్చేవ్, నికొలాయ్ బుల్గానిన్, తదితర సోవియట్ నాయకులతో కూడిన ఒక సోవియట్ పార్టీ, ప్రభుత్వ ప్రతినిధివర్గం, చెకొస్లొవాకియా కమ్యూనిస్టుపార్టీ, ప్రభుత్వాల ఆహ్వానంపైన చెకొస్లొవాకియాలో పర్యటించింది.

సోషలిస్టు దేశాల రాజకీయ వేత్తలు, పార్టీ నాయకులు ఒకరి దేశంలో మరొకరు పర్యటించడం, బలవత్తరమైన సోషలిస్టు శిబిర శక్తులను సమీకరించడంలో బ్రహ్మాండమైన పాత్రను వహిస్తుంది. ఆశించినట్లుగానే యీ పర్యటన సోవియట్-చెకొస్లొవాకియా స్నేహాన్ని, సోషలిస్టు శిబిర ఐక్యతను, ప్రపంచశాంతి సుస్థిరతను మరింతగా బలపర్చింది.

సోవియట్ ప్రతినిధివర్గం చెకొస్లొవాకియాలోని అనేక నగరాలను సందర్శించింది. సోవియట్ నాయకులు యెక్కడికి వెళ్ళినా బ్రహ్మాండమైన స్వాగతం యివ్వబడింది. సోవియట్ దేశమంటే చెకొస్లొవాకియా ప్రజలకు గొప్పగౌరవము, ప్రేమ ఉన్నాయనడానికి యేదైనా నిదర్శనం అవసరమంటే, ఇదే ఆ నిదర్శనమని మరొకసారి రుజువైనది. వివిధ ప్రాంతాల్లో సోవియట్ నాయకులు చేసిన ప్రసంగాలు, సోవియట్-చెకొస్లొవాకియా మైత్రిని, సోవియట్ ప్రభుత్వ విధానాలను బలపర్చే హర్షధ్వానాలవల్ల తరుచు కొంతసేపు ఆగవలసి వస్తుండేవి.

సోవియట్ నాయకులు చెకొస్లొవాకియా పార్టీ, ప్రభుత్వ నాయకులతో పార్టీ విషయాలను గురించీ, ఉభయులకు ఆసక్తిగల కొన్ని ఇతర సమస్యలను గురించీ అనేక సంప్రతింపులు జరిపారు. సంప్రదింపులు హృదయపూర్వక స్నేహ వాతావరణంలో కొనసాగి, ఉభయదేశాల మధ్య అన్ని విషయాలపైన సంపూర్ణ అంగీకారం కుదిరిందన్న విషయాన్ని వ్యక్తం చేశాయి.

పర్యటన అంత్యంలో, పర్యటన ఫలితాలను క్రోడీకరిస్తూ సోవియట్-చెక్ అధికార ప్రకటన ఒకటి జారీ చేయబడింది. ఇతర సమస్యలతోపాటు ఆ ప్రకటనలో అంతర్జాతీయ దిగుమతుల సమస్యలు, అమెరికా, బ్రిటన్‌ల తోడ్పాటుతో పశ్చిమ జర్మనీ అనుసరిస్తున్న విధానాలవల్ల ప్రపంచ శాంతికి కలుగుతున్న ప్రమాదం విషయమూ ప్రస్తావింపబడ్డాయి అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలింపజేయడమే, శాంతి ప్రియ ప్రజల నెదుర్కొంటున్న ప్రధాన సమస్య అని ఆ ప్రకటన ఉద్ఘాటించింది. దేశాల మధ్య సంబంధాలు, శాంతి సూత్రాలు, మైత్రి, రాజకీయ, సాంఘిక వ్యవస్థలతో ప్రమేయంలేని సహజీవనంపై ఆధారపడి వుండాలని కూడా ప్రకటన తెలిపింది.

సోవియట్ ప్రతినిధివర్గం చెకొస్లొవాకియాలో వున్నప్పుడు కృశ్చేవ్, బుల్గానిన్‌లు అంతర్జాతీయ, దేశీయ సమస్యలను గురించి ప్రస్తావిస్తూ కొన్ని ముఖ్యమైన ప్రసంగాలను చేశారు. ప్రాగ్‌లో చేసిన ఒక ఉపన్యాసంలో కృశ్చేవ్, ప్రజల చేతుల్లో అధికారముంటే యేమి సాధింపబడగలదో ప్రజ్ఞావంతులైన చెకొస్లొవాకియా ప్రజలు ప్రదర్శించారని అన్నారు. "సోషలిస్టు నిర్మాణానికి యే విధంగా సాధ్యమైతే ఆ విధంగా హాని కలిగించడానికి, ఈ దేశాలలోని విప్లవ ప్రతీఘాతక శక్తులను రెచ్చగొట్టడానికి గంతువేసి లేచే" సామ్రాజ్యవాద అభివృద్ధి నిరోధకులకు ఈ విజయాలు క్రోధాన్ని కలిగిస్తున్నాయని ఆయన ఉద్ఘాటించారు. అందుకు ఉదాహరణగా హంగరీ సంఘటనలను తెలియజేశారాయన. అఖిల యూరోపియన్ సహకారం అమలును అరికట్టడానికిగాను సామ్రాజ్యవాదులు, సైనిక కూటములుగా చీలిపోయిన యూరపు చీలికను ఇంకా అధికం చేయడానికి ప్రయత్నిస్తున్నారని ఆయన హెచ్చరించారు. నూతన యుద్ధ సన్నాహాలలో, అగ్రశ్రేణిగా ఉపయోగించేందుకు పశ్చిమ జర్మన్ సైనికవాదులను పునరుద్ధరించడానికి సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నారు. కాని, కాలం మారిపోయింది, అన్నారాయన. సోషలిస్టుదేశాలకు చెందిన 90 కోట్ల మంది ప్రజలు, వలస పాలననుండి తమను తాము విముక్తి గావించుకొన్న మరికొన్ని దేశాల ప్రజలు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా నిలబడి, శాంతి, అభ్యుదయాల శక్తులు, అభివృద్ధినిరోధక శక్తులకంటె శక్తివంతమయినవని తెలియజేశారు. ఓస్ట్రవాలో మాట్లాడుతూ, కృశ్చేవ్, సోవియట్ ప్రజలూ, సోషలిస్టు శిబిర దేశాలలోని వారి మిత్రుల శాంతియుత కృషిని యెవరైనా భంగపర్చినట్లయితే దానికి తగుశాస్తి జరగగలదని హెచ్చరించిన విషయం యీ సందర్భంలో ప్రస్తావించడం సమంజసంగా వుంటుంది.

నిరాయుధీకరణ, దేశాల శాంతియుత సహజీవనంపైన ఒడంబడికకు రాలేకపోవడానికి బాధ్యత పాశ్చాత్యరాజ్యాలదేనని ఖచ్చితంగా చెబుతూ, అందరితో శాంతి, స్నేహాలతో మనుగడ చేయడానికి సోవియట్ ప్రజలు తమకు సాధ్యమైనదంతా చేస్తున్నారని కృశ్చేవ్ ప్రకటించారు. సోవియట్ ప్రభుత్వం నిరాయుధీకరణ విషయమై ఖచ్చితమైన ప్రతిపాదనలను చేసిందిగాని పాశ్చాత్య రాజ్యాలు సోవియట్ ప్రభుత్వంతో ఒడంబడికను చేసుకోడానికి యిష్టపడలేదని ఆయన అన్నారు.

(మిగత 43వ పుటలో)

# జెనీవా సద్భావన జయించాలి

ఎ. బెలొకోవ్

జెనీవాలో సోవియట్ దేశం, అమెరికా, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సు ప్రభుత్వాధిపతులు సమావేశమై రెండు సంవత్సరాలు గడిచి పోయింది.

ఈ అత్యంత ప్రధానమైన సమావేశం ప్రపంచమంతటా రేకెత్తించిన ఉత్సాహమూ, ఆశలూ అందరికీ జ్ఞాపకం వుంటాయి.

ఆ సమావేశంలో యీ నలుగురు అగ్ర రాజ్యాధిపతులూ యుద్ధాన్ని నిరసించి, సమస్య లన్నిటినీ సంప్రదింపులద్వారా పరిష్కరించ డానికి తమ అనుకూల్యాన్ని ప్రకటించారు. నేడు, రెండేళ్ళ తరవాత, సంశయాత్మవులు యిలా అంటున్నారు: "దానివల్ల ప్రయోజన మేమీలేదని మేము చెప్పాం. జెనీవా సద్భావన ఎక్కడుంది? గత ఆకురాలు కాలంలో జరి గిన సంఘటనలు, నూతన ప్రపంచ యుద్ధం చేరువకు ప్రపంచాన్ని ఎంత తొందరగా తీసుక రావచ్చునో తెలియచేశాయి...."

గత ఆకురాలు కాలంలో యీ ఘోర ప్రమా దంలో మానవజాతి పడిపోలేదంటే, ఈజిప్టులో జోక్యాన్ని, హంగెరీలో విషాద ఘటనలనూ రెచ్చగొట్టిన దురాక్రమణ వర్గాలకంటె శాంతికా ముక ప్రజలు బలిష్ఠులుగా వున్నందు వల్లనే అన్న సంగతిని, ఈ మాటలు చెప్తతూ వున్నవారు మర్చిపోతున్నారు. అంతర్జాతీయ అభివృద్ధినిరోధకుల ప్రమాదకరమైన పన్నాగాలు జెనీవా సద్భావనకు అనుగుణ్యంగా శాంతియుత సహజీవనంకోసమూ, అంతర్జా తీయ సహకారంకోసమూ నిరంతరం కృషి చేస్తున్నవారిచే వమ్ము చేయబడ్డాయి.

నేడు జెనీవా సద్భావనకు సమాధిని కట్ట డానికి తొందరపడుతూ వున్నవారు, యిందు వల్లనే పొరపడుతున్నారు. పరోక్ష యుద్ధ విషాద దినాలకు ప్రపంచాన్ని పట్టుదలగా, మొండిగా మళ్ళించదలుచుకున్న పశ్చిమదేశాల లోని దురాక్రమణవర్గాల పథకాలకు, యిటు వంటి భావాలు ప్రోద్బలం కలిగిస్తాయి మాత్రమే. జెనీవా సద్భావనతో కృషిచేయడమంటే, అంత ర్జాతీయ ఉద్రిక్తత ఉపశమనానికి ఓపికగానే అయినా పట్టుదలగా కృషి చేయడమన్నమాట.

సాంఘిక సంఘర్షణలవల్ల ఛిన్నాభిన్నమైన మన సంక్లిష్ట ప్రపంచంలో వాదోపవాదాలూ, వైరుధ్యాలూ పుట్టాయి, పుడుతూనే వుంటాయి. ముందుగానే మార్గసూచికలన్నీ సదుపాయంగా ఏర్పాటై వున్న సుగమమైన రాజమార్గంకాదు శాశ్వత శాంతికి మార్గం.

అంతర్జాతీయ పరిణామాలు మెలికలు తిరి గిన మార్గాన సాగుతాయి. కొన్ని సమయాల్లో అవి అతికష్టమైన మార్గాన సాగుతాయి. వాస్త వానికి పశ్చిమ దేశాలలో, అన్నిటికంటె ముఖ్యంగా అమెరికాలో తమ సంపదను నిరం తర అమితాయుధోత్పత్తి పోటీ ఆధారంగా నిర్మించుకునే, ప్రమాదకరమైన యుద్ధ సమీప విధానంపైని తమ రాజకీయ విశ్వాసాలను ఆధారపర్చే అభివృద్ధి నిరోధకవర్గాలున్నాయి. యుద్ధ—పారిశ్రామిక గుత్తవ్యాపార సంస్థలతో కుమ్మక్కయి, యుద్ధ సన్నాహాలద్వారా అపార మైన లాభాలను పొందుతోన్న యీ వర్గాలే ప్రపంచ రాజకీయాలనుండి పూర్తిగా జెనీవా సద్భావనను నిర్మూలించడానికి చూస్తున్నాయి.

అయినా, పశ్చిమ దేశాలలోని అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాద వర్గాల పలుకుబడిని అధికంగా అంచనా వేయకూడదు. ఉద్రిక్తత ఉపశమనానికీ, దేశాల మధ్య అధికమైన విశ్వా సానికీ జయప్రదంగా కృషిని చేసేందుకు, ఇప్పుడు అనుకూలమైనపరిస్థితి మళ్ళీ వస్తోంది.

జెనీవాలో జరిగిన సమావేశం యీమార్గాన, యీ సరియైన మార్గాన వేసిన మొదటి అడుగు కంటె యెక్కువేమీకాదు. బలాత్కార విధా నాన్నీ, బెదరింపుల విధానాన్నీ త్యజించవలసిన ఆవశ్యకతను జెనీవాలో గుర్తించిన తరవాత, పశ్చిమ దేశాల రాజకీయ నాయకులు దురదృష్ట వశాత్తు తమ మాటలకు అనుగుణ్యంగా నికర మైన ఏ చర్యలూ చేయలేదు.

చాలామంది పశ్చిమదేశాల రాజకీయవేత్తలు యెంతో మనఃపూర్వకంగా నిరాయుధీకరణ వాంఛనీయమనీ, ఆవశ్యకమనీ ప్రతిపాదించిన ప్రకటన; యీ విషయంలో ఆచరణయోగ్యమైన ప్రారంభ చర్యలనైనా తీసుకోవడానికి— న్యూక్లియర్ ఆయుధ పాటవపరీక్షల నిషే ధానికీ, అమితాయుధోత్పత్తి పోటీని ఆపడానికీ అంగీకరించేందుకు—మిత్రరాజ్య సమితి నిరా యుధీకరణ ఉపసంఘంలో పశ్చిమదేశాల ప్రతి నిధులు మొండిగా చేసిన నిరాకరణ పరస్పరం అనుగుణంగా వున్నవని ఎవరైనా ఎలా చెప్ప గలరు?

సంబంధాల స్థాపన, ప్రజలమధ్య పరస్పర సాంస్కృతిక ఆదాన ప్రదానాలూ ఉపయోగకర మైనవని చేయబడిన ప్రకటనలు, ప్రాచ్య పాశ్చాత్య ఖండాల మధ్య వాణిజ్య, సాంస్కృ తిక సంబంధాలకు నిరోధంగా అడ్డంకులను కల్పించడమూ పరస్పరం అనుగుణంగా వున్న వని ఎవ్వరైనా యెలా చెప్పగలరు?

అధికతర అంతర్జాతీయ వాణిజ్యావశ్యకత గురించి చెప్పబడిన అన్ని కబుర్లు, సామ్యవాద శిబిరానికి చెందిన దేశాలతో వాణిజ్యానికి వ్యతి రేకంగా విచక్షణా, నిరోధవిధానమూ పరస్పరం అనుగుణంగా వున్నవని ఎవరైనా ఎలా చెప్ప గలరు?

ఐక్య, ప్రజాస్వామ్య, శాంతికాముక దేశ

ముగా జర్మనీ పెంపొందగల అవకాశమూ; పశ్చిమ జర్మనీని తీవ్రముగా పునస్సైనికం గావించే విధానమూ, దానిని నాటోకు మూలకందంగా మార్చే విధానమూ పరస్పరం అనుగుణంగా వున్నవని ఎవరైనా ఎలా చెప్పగలరు?

అమెరికాలోని నాయక వర్గాలూ, యితర పశ్చిమ దేశాలలోని వారి సహచరులూ, పూర్తిగా విఫలమైన బలాధిక్యతా విధానంయొక్క అపాయకరమైన స్థానాలను మొండిగా ఇంకా పట్టుకుని వ్రేళ్ళాడుతున్నారని ఇదంతా నిరూపిస్తుంది. జినీవాలో ప్రకటింపబడిన న్యాయయుతమైన సూత్రాలు పశ్చిమ రాజ్యాల చర్యలలో పూర్తిగా యింకా ప్రతిబింబించలేదన్న విషయానికి, దీనిలోనే కారణాన్ని అన్వేషించాలి.

జినీవాలో నిర్ణయింపబడిన లక్ష్యాల విజయాన్ని, యిందుకు పూర్తిగా భిన్నమైన మార్గాలలోనూ, భిన్నమైన సాధనాల ద్వారా పొందవలసి వుంటుందని సోవియట్ ప్రజలకు దృఢమైన విశ్వాసం కలిగింది. కొత్త యుద్ధాన్ని నిరోధించాలని చెపుతోన్న శాంతికాముక శక్తులన్నిటిని దృఢపరచడానికీ సంఘటితపరచడానికీ సోవియట్ దేశం కృషిచేస్తూన్నది. సోవియట్ విదేశాంగ విధాన ప్రధాన లక్ష్యం, సకల దేశాల శాంతియుత సహజీవనంగానూ, సహకారంగానూ వుంటూవుంది.

శాంతికొరకు వివిధ ప్రజల దీక్ష, యుద్ధ ప్రమాదానికి వ్యతిరేకంగా ప్రజల క్రియాశీలమైన నిర్మాణాత్మకమయిన పోరాటం మానవజాతి చరిత్రలో మున్నెన్నడూ యిటువంటి బలంతో, యిటువంటి నిశ్చయతతో బహిర్గతం కాలేదు, నేటివలె అవి మున్నెన్నడూ అంతర్జాతీయ పరిణామాలపైని యీ విధంగా నేరుగా ప్రభావాన్ని ప్రసరింపజేయలేదు. ఇందువల్లనే జినీవా సద్భావన జయించగలదనీ, జయిస్తుందనీ మనకు విశ్వాసం కలిగింది.

# చెకొస్లొవాకియాలో సోవియట్ పార్టీ, ప్రభుత్వ ప్రతినిధి వర్గం

(30 పుట తరువాయి)

సోవియట్ ప్రతినిధివర్గం గౌరవార్థం ఇవ్వబడిన ఒక విందులో మాట్లాడుతూ, సిరోకీ, చెకొస్లొవాకియా ప్రజలు తమ అతిథులకు ఎలా ప్రేమతోను, ఉత్సాహంతోను స్వాగతమిచ్చారో, సోవియట్ అతిథులు తమ కళ్లార చూడనే చూచారు అన్నారు. పార్టీ 20 వ మహాసభ ఫలితాలు, ఒక సోవియట్ దేశ ప్రజలకేగాక, తమ ప్రజలకూ, అంతర్జాతీయ కార్మికోద్యమానికీ గొప్ప చారిత్రక ప్రాముఖ్యతను కలిగి ఉన్నాయని చెకొస్లొవాకియా పార్టీ, ప్రజలలోని విస్తృతవర్గాలు పరిగణిస్తున్నాయని కూడా ఆయన అన్నారు. 20 వ మహాసభ నిర్ణయాలను వ్యతిరేకించడమంటే, పార్టీ ఐక్యతను, సోషలిస్టు శిబిరం, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాల ఐక్యతను వ్యతిరేకించడమన్నమాట, అని ఆయన అన్నారు.

ఈ సందర్భంలోనే బుల్గానిన్ మాట్లాడుతూ, ఉభయదేశాల మధ్య మైత్రి, ఏకాగ్రీవాభిప్రాయాల పైనను, ఒకరిపైనొకరికి గల గట్టి విశ్వాసంపైనను ఆధారపడి వున్నదిగాబట్టి అది శాశ్వతమయినదని అన్నారు.

సోవియట్ ప్రతినిధివర్గం వచ్చినప్పుడు బ్రటిస్లవాలో యేర్పాటు చేయబడిన ఒక సభలో చెకొస్లొవాకియా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ కార్యదర్శి కారల్ బెసిలక్ స్వాగతోపన్యాసం చేస్తూ, గత యుద్ధంలో సోవియట్ ప్రజలు గావించిన త్యాగాలవల్ల తమ స్వాతంత్ర్యం సాధ్యమయిందన్న విషయాన్ని గుర్తుకు తెచ్చారు. 20 మహాసభ నిర్ణయాలను సక్రమంగా అనువర్తింప జేస్తున్నందుకు తమ శత్రువులు తరుచు తమను విమర్శిస్తున్నారనీ, ఇందులో వారికి "రివిషనిస్టులు" సహాయపడుతున్నారనీ కూడా ఆయన అన్నారు. కాని, "జాతీయ కమ్యూనిజం," "ప్రజల పెట్టుబడిదారి విధానం" అనే పారపాటు అభిప్రాయాలు తమను యెన్నడూ ఆకర్షింపవని ఆయన ప్రకటించారు. సోదర సోవియట్ ప్రజలతోపాటు లెనినిజం కొరకే నిలబడతామని అన్నారు.

సోవియట్ నాయకులు మాస్కోకు తిరిగి వచ్చినప్పుడు, సోవియట్ రాజధాని ప్రజలు తమ నాయకులకు స్వాగతమివ్వడానికి వేల సంఖ్యలో సమావేశమయ్యారు. బ్రహ్మాండమైన స్వాగతమిచ్చారు. సభాస్థలి హర్షధ్వానాలతో మారుమ్రోగింది. అనేకమంది ఈ సందర్భంలో ప్రసంగించారు. వారందరూ అత్యంత ఉత్సాహంతో ఈ పర్యటనా ఫలితాలను హర్షించారు.

కృశ్చేవ్, బుల్గానిన్‌లుకూడా మాట్లాడుతూ చెకొస్లొవాకియాలో తమ ఆనందదాయకమైన పర్యటనను గురించి చెప్పారు.

దేశాలు, ప్రజల ప్రయోజనాలదృష్ట్యా సరియైన విధానాలను అనుసరించి నట్లయితే అవి అందరి శ్రేయస్సుకొరకు వివిధ దేశాలు స్నేహ, సహకారాల్లో మరింత సన్నిహితంగా రావడానికి దారితీయగలవని యీ పర్యటన మరొకసారి యావత్ప్రపంచానికి రుజువు చేసింది.




కాన్స్టాంతిన్ పౌస్తొవస్కీ

(గతసంచిక తరువాయి)

“దేవుడు మనలను రక్షించునుగాక!” అంటూ గొణిగాడు మఠాచార్యుడు. “ఈయనకు కొంచెం వెర్రి వున్నట్టుగా వుంది. సాలె పురుగు కుట్టివుండాలి.”

“నిజంగా మనసును కలచివేసే అందంగల స్త్రీ లున్నారు” అంటూ చెప్పుకపోతున్నాడు ఆండర్సన్. “వాళ్లు యించుమించుగా తమలో తాము గూళ్లు కట్టుక జీవిస్తుంటారు—తమ్ముదహించి వేసే ఉద్రేకాలలో జీవిస్తుంటారు వాళ్ళు. లోపలినుండి రగులుతూ వున్నట్టుగా అది వారి ముఖాలను కాల్చివేస్తుంది మారియా, నీవు అటువంటి దానివే. ఇటువంటి స్త్రీల జీవితం సాధారణంగా చుక్కెదురుగావుండే రెండు విధాలుగా వుంటుంది—చాలా విషాదంగానైనా, చాలా ఆనందంగానైనా.”

“ఇటువంటి స్త్రీని మీరెన్నడైనా కలుసుకున్నారా, మహాశయా?” అని అడిగిం దావిడ.

“ఈ బండిలోకూడా కలిశాను. నేను చెప్పేమాటలు మారియాకు మాత్రమే వర్తించవు, మీకుకూడా వర్తిస్తాయి.”

“ఈ దీర్ఘ రాత్రిప్రయాణం విసుగెత్తించకుండా వుండడానికి మాత్రమే కాదు, మీరు యిటువంటి మాటలను చెపుతున్నది” అంటూ ఆవిడగొంతులో కాస్త ఒణుకుతో అంది.” ఈ అందమైన అమ్మాయి విషయంలో యిది చాలా దారుణమైన విషయం” అంటూ “నా విషయంలోకూడా” అని మందస్వనంలో అంది.

“నా జీవితంలో నేనెన్నడూ నేనింత తీవ్రంగా మాటాడలేదండీ” అన్నాడు ఆండర్సన్.

“కాని ఏదది? ఆనందమా, విషాదమా?” అనడిగింది మారియా.

“నీవు అమాయిక గ్రామ బాలికవు. కాని జీవితంనుండి చాలా ఆశిస్తున్నావు. ఆనందం అంత సులభంగా నీకు దొరికిపోదు. కాని నీ పెద్ద కోరికలకు సరిపడే పురుషుణ్ని నీవు కలుస్తావు. అతను చెప్పుకోవలసిన మనిషిగా వుంటాడు. బహుశా అతను చిత్రకారుడో, కవో, మీదేశ స్వాతంత్ర్యయోధుడో అయి వుంటాడు. లేదూ, మామూలు గొర్రెలకాపరో నావికుడో అయి వుంటాడు. ఏమయినా గొప్ప హృదయం గలవాడు.”

“మహాశయా” అంది మారియా ప్రశాంతంగా. కాని ఆమె గొంతుకలో దృఢత్వం కనిపిస్తోంది. “నేను మిమ్మలను చూడలేదు. అందువల్ల నేను సిగ్గుపడకుండా మిమ్మల్ని ఒకటడుగుతాను—“అటువంటి పురుషుణ్ని నేను యిప్పటికే ప్రేమిస్తూ వున్నట్టయితే తప్పేమిటి? నేను ఆయువను కొద్దిసార్లు మాత్రమే చూశాను. ఇప్పుడాయన యెక్కడున్నారో కూడా నాకు తెలియదు.”

“అతనికోసం వెతుకు” అన్నాడు ఆండర్సన్. “వెతికి పట్టుకుంటే చిన్న తను ప్రేమిస్తున్నట్టుగా తెలుస్తుంది.”

“మారియా!” అని పిలిచింది అన్నా. “వెరోనాలో ఆ యువకుడు, చిత్రకారుడున్నాడే—అతనే అయివుండాలి....”

“ఊరుకో!” అని ఆజ్ఞాపించింది మారియా.

“వెరోనా అంతటి పెద్ద ఊరు కాదు” అంది ఆ పెద్దావిడ. “నువ్వు అతన్ని అక్కడ కనుక్కోగలుగుతావు. నా పేరు జ్ఞాపకం పెట్టుకో—నా పేరు ఎలీనా గుయిక్కియెలీ. నేను వెరోనాలో వుంటున్నాను. మాయిల్లు ఎవ్వరైనా చూపిస్తారు. మారియా, వెరోనాకు రా. ఇప్పుడు మన స్నేహితుడు చెప్పిన ఆనందసన్నివేశం తటస్థపడేదాకా నాతో వుండు.”

ఆ చీకటిలో మారియా, ఎలీనా గుయిక్కియెలీ చేతిని వెతికి, దానిని నిమిరి, తరవాత ఆ చల్లని వేళ్ళను తన వెచ్చని చెక్కిలికి హత్తుకుంది.

అందరూ నిశ్శబ్దంలో పడ్డారు. ఆకుపచ్చని తార దిగ్మండలానికి దిగువగా జారిపోయినట్టుగా ఆండర్సన్ గమనించాడు. రాత్రిలో సగభాగంపైగా గడిచిపోయింది.

“నా గురించేమైనా చెప్తారా!” అని చివరికి అడిగింది అన్నా, ఆ పిల్లల్లో యెక్కువ మాటల పుట్టయిన అమ్మాయి.

“నీకు చాలామంది పిల్లలు కలుగుతారు” అని ధైర్యంగా చెప్పాడు ఆండర్సన్. “వాళ్లు పాలకోసం గ్లాసులు పట్టుకొని వచ్చినప్పుడు చిన్న బారుగా ఏర్పడతారు. వాళ్ళను కడగడానికీ, తల దువ్వడానికీ ప్రతి ఉదయమూ నీకు చాలా పని వుంటుంది. నీ భర్త నీకు సాయం చేస్తాడులే—”.

“పియెత్రో చెయ్యడు” అని అరిచింది అన్నా. “ఆ దుర్మార్గుడు పియెత్రో చెయ్యడండి. అతనితో నాకు సంబంధం లేదు.”

“మెరుస్తూ, వింతచూపు చూస్తూవున్న కళ్ళతోవున్న ఆ బుల్లి బుల్లి మొగపిల్లవాళ్ళనూ, ఆ బుల్లిబుల్లి ఆడపిల్లలనూ ముద్దాడుతూ నువ్వు రోజూ ఎంతోకాలం గడుపుతావు, రోజూ వాళ్ళను ఎన్నోసార్లు ముద్దాడుతూ.”

“పరమ పవిత్రులైన పీఠాధిపతులున్న దేశంలో యీ వెర్రితనాన్నంతట్నీ వినడమంటే—ఊహించరాని విషయం!” అంటూ మఠాచార్యుడు గొణుక్కున్నాడు. కాని ఎవ్వరూ అతని మాటను వినిపించుకోలేదు.

ఆ అమ్మాయిలు మళ్ళీ తమలో తాము గుసగుసలాడుకోవడం మొదలుపెట్టారు. ఆ గుసగుసల్లో నవ్వులూ. చివరికి మారియా యిలా అంది:

“మహాశయా, దయచేసి మీరెవరో చెప్పండి. మేము చీకటిలో చూడలేమని మీకు తెలుసునుగదా.”

“నేనొక తిరుగుబోతు కవిని” అన్నాడు ఆండర్సన్. “నేను యువకుణ్ని, దట్టంగా వంపులు తిరిగిన జుట్టుంది నాకు, శ్యామల వర్ణమైన ముఖం నాది. నా నీలపుకళ్ళు ఎప్పుడూ నవ్వుతూవుంటాయి. నాకీ ప్రపంచంలో దిగుళ్లు, ప్రేమ దిగుళ్లు సైతం లేకపోవడంవల్ల,

నేనింకా ప్రేమ వ్యవహారాల్లో పడకపోవడంవల్ల. నాకున్న వృత్తిఅల్లా నాచుట్టుప్రక్కలనున్న వాళ్ళకు చిన్నచిన్న బహుమానాలు యిస్తూ వుండడమూ, చిన్నచిన్న పనులు చేస్తూవుండడమూ—వాళ్ళకు ఆనందాన్నిచ్చినట్టయితే చిలిపిపనులు కూడా."

"ఎటువంటి పనులవి?" అనడిగింది ఎలీనా గుయిక్కియోలి.

"ఉదాహరణకు యిది వినండి: గత వేసవిలో నేను ఒక స్నేహితునితో వుంటూవుండేవాణ్ని ఆయన జట్లాండ్‌లో అటవీ ఉద్యోగి. ఒకరోజున అటవిలో నడుస్తూవుండే నాకు చిన్న త్రోవలో చాలా పుట్ట గొడుగులు కనిపించాయి. తరవాత నేనక్కడికి వెళ్ళి ఒకొక్క పుట్టగొడుకు క్రింద ముచ్చిరేకుల చుట్టి పిప్పరమెంటు బిళ్లనో, ఖర్జూరంపండునో, మైనంతో చేసిన చిన్న పూలగుత్తినో, కుట్టుపనివాళ్లు వ్రేలికి పెట్టుకునే కుడుకనో, సిల్కు రిబ్బనునో దాచి పెట్టాను. మర్నాటి ఉదయం అటవీ ఉద్యోగి చిన్నమ్మాయితో కలసి నేను అక్కడికి వెళ్ళాను. ఆ అమ్మాయి ఏడేళ్ళది. ఒకొక్క పుట్ట గొడుగుక్రింద ఆ పిల్లకు అద్భుతమైన వస్తువులు కనిపించాయి. ఖర్జూరం పండుమాత్రం కనిపించలేదు. బహుశా దానిని కాకి దొంగిలించి వుంటుంది ఆ పిల్లకళ్లల్లో మెరిసిన సంతోషాన్ని మీరు గనక చూసివున్నట్టయితేనా! వాటన్నిటినీ ధనపిశాచి అక్కడ పెట్టిందని నేనా అమ్మాయికి చెప్పాను."

"ఒక అమాయిక బాలికను మోసగించావు!" అంటూ తన అసమ్మతిని తెలియజేశాడు మతాచార్యుడు. "ఘోర పాపం!"

"నేనా అమ్మాయిని మోసగించలేదు. ఆ రోజును ఆ పిల్ల యావజ్జీవితమూ జ్ఞాపకం పెట్టుకుంటుంది. అటువంటి దేవతాకథను ఎన్నడూ అనుభవించని వాళ్ళలాగ కాకుండా ఆపిల్ల గుండె కఠినం కాదని గట్టిగా చెపుతున్నాను ... .. స్వాములవారికో మనవి—పిలవని పేరంటంగా వచ్చి చీవాట్లు పెడితే స్వీకరించడం నాకలవాటులేదు."

బండాగింది. ఆ అమ్మాయిలు కదలకుండా కూచున్నారు. మైకంతో వున్నట్టుగా. ఎలీనా గుయిక్కియోలీ మాటాడలేదు. తల వంచుకునివుంది.

"అమ్మల్లారా, లెండి మనం వచ్చేశాం" అని కేకేశాడు బండివాడు.

ఆ పిల్లలు మళ్ళీ తమలో తాము గుసగుస లాడుకున్నారు. ఏదో ఒక నిర్ణయానికి వచ్చారేమో, లేచి నిలబడ్డారు.

హటాత్తుగా చీకటిలో బలిష్ఠంగా, సన్నగా వున్న రెండు చేతులు ఆండర్సన్ మెడను చుట్టివేశాయి. వెచ్చని పెదవులు అతని పెదవులకు హత్తుకపోయాయి "కృతజ్ఞురాలిని!"అని ఆ పెదవులుగుసగుసలాడాయి. ఆండర్సన్ మారియా గొంతుకను పోల్చుకున్నాడు. నికొలీనాకూడా ఆయనకు కృతజ్ఞతను తెలిపింది, ఆయనను మృదువుగా, ఆర్ద్రంగా ముద్దాడింది, తన జుట్టు ఆయన చెక్కిలినితుడుస్తూ వుండగా. అన్నా ఆయనను గట్టిగా, చప్పుడుచేస్తూ ముద్దాడింది.

ఆ బాలికలు దిగిపోయారు. బండి వెళ్ళిపోతూ వుంది, ఆ నగరవీధి రాతిబాటమీదుగా. ఆండర్సన్ కిటికీగుండా చూవాడు. కాని అతనికి ఏమీ కనిపించలేదు. ఆకుపచ్చని ఉదయకాంతుల మీదుగా నల్లని చెట్ల పైభాగాలు తప్పితే.

వెరోనా ఆండర్సన్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఒకొక్క భవనమూ, తన ప్రక్కనున్నదానితో అందంలో పోటీపడుతూ వున్నట్టుగా వుంది. వాస్తుశిల్ప సమ్మేళనం అతనికి హాయిని కలిగించి వుంటుంది, కాని అతని హృదయంలో ప్రశాంతత లేదు

ఆరోజు సాయంత్రం అతను గారీనా గుయిక్కియోలి పాత యింటి తలుపు తట్టాడు. అది ఒక దుర్గానికి వెళ్ళే సన్నని వీధిలో వుంది.

ఆమే తలుపు తెరిచింది. ఆమె సన్నని విగ్రహాన్ని పచ్చని మొఖమల్ దుస్తులు అలంకరించి వున్నాయి. ఆ మొఖమల్ పచ్చదనం ఆమె కళ్ళలో ప్రతిబింబిస్తోంది, ఆ ఆలేఖ్య నేత్ర విలాసంతో.

ఆమె తన రెండుచేతుల్నీ సారజాచింది; తన సన్నని, చల్లని వ్రేళ్ళతో అతని దృఢమైన చేతులను పట్టుకుని ఒక చిన్నహాలు లోనికి తీసుక వెళ్ళింది.

"మీరు వచ్చినందుకు సంతోషం. మనం విడిపోయి కొద్ది సమయమే అయినా నాకు అదోలా వుంది" అందామె సిగ్గుగా చిరునవ్వుతూ.

ఆండర్సన్ సొలిపోయాడు. ఆ రోజల్లా అశాంతిగా ఆమె గురించి ఆలోచిస్తున్నాడు. స్త్రీఅనే ప్రతిమాటనూ, ప్రతి కంటిరెప్పనూ, ఆమె దుస్తులమీద పడే ప్రతి ధూళిరేణువునూ బాధించే ప్రేమతో ప్రేమించవచ్చునని అతనికి తెలుసును. కాని తనలో నిప్పు రగిల్చే

పౌస్తొవస్కీ కథానిక "రాత్రిప్రయాణా"నికి వి. యస్. క్లిమస్కిన్ లిఖించిన చిత్రం



ప్రేమకు తాను వశుడైనట్టయితే, దానిని ఆయన భరించలేడు. అది ఎటువంటి యాతనలనూ, పారవశ్యాలనూ, కన్నీళ్ళనూ, నవ్వులనూ, పూలనూ, ముళ్ళనూ తెచ్చి పెట్టగలదంటె, దానిమార్పులూ, వింతలూ భరించడం అతనికి శక్యంకాదు.

ఈ ప్రేమ ఆయనను వశపర్చుకున్నట్టయితే, తన మనస్సునుండి వెలువడే నానా రకాల దేవతా కథాజాలమంతా మసకబారిపోయి, తిరిగి రాకుండా అదృశ్యమై పోతాయేమో. అప్పుడతనికి మిగిలేదేమిటి?

ఇటువంటి ప్రేమ ప్రతిఫల శూన్యమవుతుందనికూడా అతను భావించాడు. అతని జీవితంలో యింతకు ముందర యెన్నిమార్లిది జరగలేదు. ఎలీనా గుయిక్కియొలీ వంటి స్త్రీలను పట్టుకున్నది చాపల్యమే. ఒక రోజున ఆమె తన అనాకారితనాన్ని తెలుసుకుంటుంది. తనకుతానే జుగుప్సాకరంగావున్నాడు. తనకు వెనుకమారుగా తనను వెటకారంతో చూడడం, అతను యెన్నిపార్లు అనుభవించలేదు. అతని నడకలో చురుకుదనం పోతుంది, నేలమీద పడిపోతాడా అన్నట్టుగా అతను జోగిపోతాడు.

ప్రేమ శాశ్వతంగా వుండగలదనీ, కవితా మేఘ కాంతులు శాశ్వతంగా కమ్మివుండగా అది మనగలదనీ ఒక్క ఊహావిహారంలో మాత్రమే అతను తనకుతాను చెప్పుకున్నాడు. తాను వాస్తవంగా జీవించిన దానికంటె బాగా తన రచనలలో ప్రేమను ఆరాధించ గలుగుతూ వుండడం వింతగా వుంది.

ఇందువల్లనే అతను ఎలీనా గుయిక్కియొలీ వద్దకు వచ్చాడు, ఆమెనుచూసి మరిరాకుండా వెళ్ళిపోదామన్న దృఢమైన విశ్వాసంతో.

అది ఆమెకు అతను చెప్పలేకపోయాడు. వారు తమ ప్రేమను ప్రకటించుకోలేదు. గతరాత్రి ఆ బండి ప్రయాణంలో మాత్రమే వారు కలుసుకుని, కొద్ది మాటలు మాత్రమే ఆడుకున్నారు.

ఆ హాలు ప్రవేశంలో ఆండర్సన్ ఆగి తన చుట్టూరా చూసుకున్నాడు. ఒక మూలను, కొవ్వువత్తుల సెమ్మెనుండి కాంతులు పడుతూవుంటే, దయానా శిరస్సుయొక్క చలవరాతి విగ్రహం, తన సౌందర్యాన్ని గురించి ఆలోచించుకుంటూ పొందిన ఉద్రేకంవల్ల పాలిపోయిందా అన్నట్టుగా తెల్లగా మెరుస్తూవుంది.

"ఈ దయానాలో మీముఖానికి అమరత్వాన్ని కల్పించిందెవరు?" అంటూ అడిగాడతను.

"కనోవా" అంది ఎలీనా కంటిరెప్పలు వాల్చుకుంటూ. అతని తలలో జరిగిపోతూ వున్నదాని నంతట్నీ ఆమె ఊహించినట్టుగా వుంది.

"నేను సెలవు తీసుకోవడానికి వచ్చాను"అన్నాడు ఆండర్సన్ బాధగా. "వెరోనానుండి పారిపోతున్నాను."

"మీరెవరో తెలుసుకున్నాను" అందామె అతని కళ్ళలోనికి సూటిగా చూస్తూ. "మీరు హాన్స్ క్రిష్టియన్ ఆండర్సన్, ప్రఖ్యాతమైన దేవతా కథలను వ్రాసినవారు. కాని జీవితంలో దేవతా కథలకు మీరు భయపడుతూ వున్నట్టుగా కనిపిస్తోంది. ప్రేమించడానికి మీకు శక్తిగాని ధైర్యంగాని లేదు.

"నేనీ శిలను భరించక తప్పదు" అని ఒప్పుకున్నాడు ఆండర్సన్.

"అయితే సరేగాని, సంచారకవీంద్రా" అందామె కొంచెంగా, ఒక చేతిని అతని భుజంమీదవేసి, "పారిపోయి ప్రమాదాన్నితప్పించుకోండి. ఎప్పుడూ మీ కంటిలో ఒక చిరునవ్వు వెలుగుతూ వుండాలి, నాగురించి ఆలోచించవద్దు. కాని ఎప్పుడైనా మీరు బాధపడుతూ వున్నట్టయితే వృద్ధాప్యం వల్లగాని, దారిద్ర్యం వల్లగాని, వ్యాధివల్లగాని—ఒక్కమాట కబురుపెడితే చాలు నేను వికాలినాలాగ మీవద్దకు వస్తాను, మంచు కప్పిన కొండలమీదుగా, నీరులేని ఎడారుల మీదుగా వేలమైళ్లు గడిచికాలినడకను వస్తాను, మీకు సుఖం కలిగించడానికి."

ఆమె పడకకుర్చీలోనికి కూలిపోయింది, తన చేతులతో ముఖం కప్పేసుకుంది. దీపపు సెమ్మాలోని మైనపువత్తులు చప్పుడు చేస్తున్నాయి.

ఆమె సన్నని వ్రేళ్ళమీదుగా మెరుస్తూవున్న ఒక కన్నీటి చుక్క జారి, ఆమె దుస్తుల మొఖమల్ మీదుగా మెలమెల్లగా జారుతూ వుండడం ఆండర్సన్ చూశాడు.

అతను తొందరగా ఆమె ప్రక్కకు వెళ్ళాడు, మోకరిల్లి ఆమె పాదాలను ముద్దుపెట్టుకున్నాడు. కళ్ళు విప్పకుండా ఆమె క్రిందికివంగి అతని తలను తన చేతులతో పట్టుకుని అతని పెదవులపైని ఒక ముద్దును ముద్రించింది.

ఒక వెచ్చని కన్నీటి చుక్క అతని ముఖంమీద పడింది. తన పెదవులపైని దాని ఉప్పదనాన్ని అతను రుచి చూశాడు.

"వెళ్ళండి,"అందామె మృదువుగా "మీ కవితా దేవత మిమ్ములను క్షమించుగాక!"

అతను నిలబడి ఆ యింట్లోనుండి గబగబా వెళ్ళిపోయాడు.

వెరోనాలోనున్న చాలా చర్చిల గంటలు సాయం ప్రార్థనల కోసం గణగణా మ్రోగుతున్నాయి.

వాళ్లెన్నడూ మరి కలుసుకోలేదు; కాని వాళ్లు ఎన్నడూ మర్చిపోలేదు.

బహుశా అందువల్లనే యేమో ఆండర్సన్ తాను మరణించడానికి కాస్త ముందర, ఒక యువ రచయితతో యిలా అన్నాడు:

"నా దేవతా కథల నిమిత్తం నేను చాలా పెద్ద ధరను చెల్లించాను, చెప్పశక్యం కానంత పెద్ద ధరను చెల్లించాను. వాటికోసం నా సౌఖ్యాన్ని వదులుకున్నాను. భావన—చాలా బలమైనదీ, తళతళలాడేదీ అయినప్పటికీ—వాస్తవికతకు చోటివ్వవలసిన సమయాన్ని నేను అందుకోలేక పోయాను.

నేస్తం, భావనను ఉపయోగించడానికి ప్రయత్నించు, అది ప్రజలకు దుఃఖాన్నికాక సౌఖ్యాన్నిచ్చేందుకు."

సమాప్తం

---

## క్రాస్నీ ప్రొలెతరీ కార్మిక సంఘ గ్రంథాలయం

(18వ పుట తరువాయి)

సాహితీపరుల సహాయంతోనే ప్రచురింపబడింది.

మా కార్మికులు వ్రాసిన పద్య, కథా, నాటక సంపుటాలు కూడా, కొద్దిరోజుల్లో మా గ్రంథాలయాన్ని అలంకరించగలవని ఆశిస్తున్నాము. మా పరిశ్రమలో ఒక సాహితీసమితికూడా వుంది. దీనిని రచయిత అలెగ్జాండర్ బోర్షగొవస్కీ, కవి అలెగ్జాండర్ ఒయ్‌స్లెందర్ నడుపుతున్నారు. ఈ సంఘ సభ్యులు వివిధ విషయాల్లో ప్రతిభ గలవారు, వివిధ వృత్తులకు చెందినవారు. కాని వారందరూ సారస్వత ప్రియులు, తమ విశ్రాంతి కాలాన్ని అందుకు వినియోగిస్తారు.

కార్మికుల జీవితంలో సారస్వతం ఒక బలమైన స్థానాన్ని అలంకరించడం చాలా సంతోషించవలసిన విషయం, చాలా ప్రముఖవిషయమున్నూ. వారు ఎక్కువగాచదవడం మాత్రమేకాదు, వ్రాస్తారుకూడా.

వృద్ధురాలినీ, గ్రంథాలయోద్యోగినిని అయిన నాకు, యిది ఒక మహాకావ్యసృష్టివలె ఉత్తేజాన్ని కల్పిస్తోంది—యిది జీవితమే అయినందువల్ల.

# మంచుబంతి భారతదేశానికి ఎట్లా వెళ్లింది?



సోవియట్ బాలల రచయిత సెర్గీ బరుజ్దిన్ కథ

(గతసంచిక తరువాయి)

## 15వ నెంబరు ప్రయాణీకురాలు

సెప్టెంబరు నెలలో ఒక వెచ్చనిరాత్రి. విమానాల రాకపోకలకోసం వేయబడిన కాంక్రీటు రన్‌వేస్‌పైని సెర్చిలైట్లు వెలుతురును ప్రసరిస్తున్నాయి. చీకటిలో ఎర్రదీపాలూ, పచ్చదీపాలూ మిణుకు మిణుకుమంటున్నాయి, వైమానికులు ఎక్కడ దిగాలో, ఎక్కణ్నుండి ఎగరాలో తెలియజేస్తూ.

"మాస్కో-తాష్కెంట్ విమానంలో ప్రయాణీకులుఎక్కండి" అని చెపుతోంది లౌడ్‌స్పీకర్. విమానాశ్రయ భవనంనుండి పదముగ్గురు ప్రయాణీకులు వచ్చి విమానం వేపుకు వెళ్తున్నారు. కొద్ది నిమిషాల తరవాత, మెత్తలుకుట్టి తెల్లని గలేబులు తొడిగివున్న పడక కుర్చీల మీద వారు కూచుంటున్నారు. ఆఖరు కుర్చీమాత్రమే కాళీగా వుంది.

విమానం బయలుదేరడానికి పదినిమిషాలు ముందర, పద్ధాలుగో ప్రయాణీకుడు వచ్చాడు. ఆయన విమానం వద్దకు బస్సులో వచ్చాడు. విమానాశ్రయోద్యోగులూ, వైమానికదళంవారూ అతనిని ఆదరంగా పలకరించారు.

"ఇగోర్ పెత్రోవిచ్, వాటిని తీసుకవచ్చారా? అవన్నీ బాగున్నాయా?"

"అవును, బాగున్నాయి."

"అయితే వాటిని ఎక్కించేద్దాం."

ఉద్యోగులు ఇగోర్ పెత్రోవిచ్ అని పిలిచిన పద్ధాలుగో ప్రయాణీకుడు ఆఖరు ప్రయాణీకుడు కానేకాదని తేలిపోయింది.

ఇగోర్ పెత్రోవిచ్ విమానంలోనికి ఎక్కగానే, బలమైన చేతులు బస్సులోనుండి ఇనుపబోనును ఎత్తి, దానిని విమానంలోనికి తీసుకవచ్చాయి. విమానద్వారంగుండా బోను కాస్తలోపలికి వెళ్ళింది. సామాన్లతోబాటుగా దానిని విమానం చివరిభాగంలో వుంచారు. హటాత్తుగా ఒక పెద్ద గర్జన వినిపించింది. ప్రయాణీకులు గాభరా ఎత్తి నిలబడ్డారు.

"ఎలుగుబంటి! ఘోరప్రమాదం!"అని ఒక డరిచాడు.

"భయపడవద్దు!" అంటూ ఇగోర్ పెత్రోవిచ్ వాళ్ళకు అభయం యిచ్చాడు. "ఇది ధృవప్రాంతపు ఎలుగుబంటిపిల్ల. దీనిని మంచుబంతి అని పిలుస్తుంటాము."

"ఇది 15వ నెంబరు ప్రయాణీకురాలు" అని విమానదళంలోని సభ్యుడొకడు హాస్యమాడాడు. "కాసేపట్లో యింకా కొంతమంది ప్రయాణీకులు వస్తాయి."

"ఎవరది?"

ఆ సమయంలో యింకో రెండు బోనులు విమానంలోనికి ఎక్కించబడ్డాయి. ఒకదానిలో పావురాలు, తన పొడవాటి తోకను బోను గజాలకు కోపంగా కొట్టే బొచ్చుమయంగా వున్న నల్లని—గోధుమ వర్ణపు జంతువువున్నాయి.

"ఇదేమిటి?"

"ఇది వుల్వరైన్, దీనిపేరు రోసా" అని ఇగోర్ పెత్రోవిచ్ వివరించాడు, బోనును అమర్చడంలో మనుష్యులకు సాయపడుతూ.

"ఈ విమానంలో రోసా వుండడం మాకెంతమాత్రమూ యిష్టం లేదు" అన్నాడొక ప్రయాణీకుడు. తక్కినవాళ్ళంతా ఆతనితో పూర్తిగా అంగీకరించారు. వారు యింతకు ముందెప్పుడూ యిటువంటి ప్రయాణీకులతో ప్రయాణం చేయలేదు.

"మద్రాసు జంతుప్రదర్శనశాలకు యివి "కానుకలు"అని మళ్ళీ ఇగోర్ పెత్రోవిచ్ వివరించాడు, బోనులను కాన్వాసుతో కప్పుతూ. మంచుబంతి గప్‌చుప్‌గా వూరుకుంది. రోసా, పావురాలు కూడా అంతే. పావురాలను జంటలుగా విడదీసి, బోనులోని వేరువేరు అరల్లో పెట్టారు. వాటిలో రెండు చాలా తెల్లగావున్న పావురాలు, గోధుమ వర్ణపు రెక్కలుగల రెండుతెల్లని పావురాలూ, బూడిదరంగు రెక్కలుగల రెండు తెల్లపావురాలూ వున్నాయి.

ప్రయాణీకులు తమతమ జాగాల్లోకి వెళ్ళిపోయారు. వెంటనే విమానం రన్‌వేమీద దొర్లుకపోయింది ఉదయం రెండున్నర గంటలకు అది గాలిలోనికి లేచింది. నీలపురాత్రి దీపాలు తప్పితే, లోపల దీపాలు ఆర్పివెయ్యబడ్డాయి విమాన ప్రయాణాలు అలవాటయిన ప్రయాణీకులు వెంటనే నిద్రపోయారు. కొందరు కునుకుపాట్లు పడుతున్నారు. ఇగోర్ పెత్రోవిచ్ వారిలో ఒకడు. అంతా సరిగ్గా వున్నట్టుగా కనిపించినా, అతను ప్రయాణం చెయ్యక తప్పలేదు.

ఇరవై నిమిషాలు తరవాత భూమికి రెండువేల మీటర్లు పైకి వారు వెళ్ళినప్పుడు, మంచుబంతి అశాంతిగా గర్జించింది ఇది ప్రయాణీకులకు చాలా గాబరా ఎత్తించింది. ఇగోర్ పెత్రోవిచ్ గబాలునలేచి, మంచుబంతి బోనువేపుకు వెళ్ళాడు. ఎలుగుబంటి పిల్ల

ఒక మూలను నక్కి. జాలిగా మూలుగుతోంది. పక్కనున్న బోనులో రోసా మేలుకొంది. అది నిల బడి పీపువంటి బద్ధకం తీర్చుకుంది. పా వు రా లు పంజరాల్లో కలకలమంటున్నాయి.

"ఏమిటే విశేషం, మంచుబంతీ! తెలివితక్కువ దానా, ఏదన్నా చూసి జడిశావా?" అని అడిగారు ఇగొర్ పెత్రోవిచ్ బోనువద్దకూచొని. మంచిమాటలు మాత్రమే మంచుబంతిని బుజ్జగించలేవని అతనికి తెలుసును. మంచుబంతి మూలుగుతూనే వుంది, మొదట తన చిన్న నల్లముక్కును, తరవాత తన పంజానూ గజాలగుండా తోస్తూ.

"ఒక్కక్షణం వుండు, మంచుబంతీ, నీక్కావల సింది నా దగ్గరుందిలే" అన్నాడు ఇగొర్ పెత్రోవిచ్. అతను ఎముకతోవున్న వుడకేసిన మాంసంముక్కను తన సంచిలోనుండి తీసి, దానిని బో ను లో ని కి విసిరేశాడు.

మంచుబంతి ఆశగా ఎముకను తీసుకుని, దూరంగా ఒకమూలకు వెళ్ళిపోయింది. అదిక మూలగడంలేదు, యిప్పుడు ఎముకను చీకుతూ వుండడంవల్ల.

ప్రయాణీకులను బుజ్జగించడం ఇంతకంటె కష్టమని పించింది.

మాస్కో నుండి కాబూల్‌వరకూ ప్రయాణం అంతట్లో ఇగొర్ పెత్రోవిచ్ బోనులదగ్గర్నుండి కదలలేదు. వుల్వెరైన్, పావురాలూ అతనిని పట్టించుకోలేదు, కాని మంచుబంతి ఇగొర్ పెత్రోవిచ్ వుంటేనే శాంతంగా వుండేది. బోను ఊచలమీదగా ఆది తలనుకూడా ఎత్తేది, తట్టి బుజ్జగిస్తారని.

## రోసా మూర్ఛ

కాబూల్‌లో ఇగొర్ పెత్రోవిచ్, అతని జంతువులూ భారత విమానంలోనికి మారాయి. భారతీయ వైమానికులు కేబిన్‌లో నుండి కుర్చీలను తీసివేశారు, యీ బోనులు పెట్టేందుకు.

విమానం బయలుదేరింది.

మొదట అంతా సరిగ్గానే వుంది. మంచుబంతి, రోసా తమ బోనుల్లో వెనుకకూ ముందుకూ పచారీ చేస్తున్నాయి. పావురాలు తమతమ స్థానాల్లోనుండి మృదువుగా కువకువలాడు తున్నాయి.

విమానం సరిహద్దునుదాటి, పాకిస్తాన్లోనికి ఎగి రింది. తొందర్లో వారు దిగువను సిం ధు న ది ని చూశారు. రానురాను వేడి ఎక్కువవుతోంది. వేడితో నిండిన గాలి మెరుస్తోంది. పెద్ద రాబందుల మందలు, విమానానికి ప్రక్కగా ఆకాశంలో యె గు రు తూ వున్నాయి.

ఒక గంట తరవాత వారు లాహోరుమీద ఎగురు తున్నారు, తాము భారత దేశాన్ని చేరుతున్నామని తెలుసుకున్నారు. ముందున్నది ఢిల్లీ.

ఇగొర్ పెత్రోవిచ్ బోనులవద్దకు మె ల్ల గా వచ్చాడు. బోనులో రోసా పడివుండడంచూసి అతను ఆశ్చర్యపడ్డాడు. అది సరిగా ఊపిరి తీయడం లేదు.



బలిష్ఠమైన మంచుబంతి చివరకు మానవశక్తికి లొంగింది

ప్రయాణీకులు బోనుచుట్టూరా గుమిగూడారు, పనిలోలేని విమానోద్యోగులుకూడా. ఇగొర్ పెత్రోవిచ్‌కు చాలా భయంవేసింది. అతను తొందరగా బోను తలుపు తెరిచి వుల్వెరైన్‌ను పైకెత్తి చూశాడు. ప్రాణం వున్నట్టుగా కనిపించడం లేదు.

"నీళ్లు! తొందరగా!" అని ఇగొర్ పెత్రోవిచ్ కేకేశాడు.

ఒక ప్రయాణీకు డతనికి నీటి సీసా అందించాడు. ఇగొర్ పెత్రోవిచ్ రోసా దవడలను విప్పి, దాని గొంతుకలో చన్నీళ్ళు పోశాడు. ఒక నిమిషంలో అది కళ్ళువిప్పి, రొప్పడం మొదలు పెట్టింది.

"దీనికి వడదెబ్బ తగిలి వుంటుంది" అన్నాడు ఇగొర్ పెత్రోవిచ్. "మొదట నాకు భయం వేసింది...."

(సశేషం)

ఓ మంచుబంతీ, మాస్కో పౌరురాలివి కాగానే, నువ్వు నగర జీవితానికి అలవాటు పడాలి, ఇక్కడ నివసించే ప్రతివ్యక్తి ఆరోగ్యం పరీక్షించ బడు తుంటుంది, మేము నీ ఆరోగ్యంపట కూడా శ్రద్ధ తీసుకుంటాం



# 250 వ వార్షికోత్సవం జరుపుకొంటున్న లెనిన్‌గ్రాడ్



లెనిన్ గ్రాడ్ 250 వ వార్షికోత్సవ స్మృతి పతకం

లెనిన్‌గ్రాడ్ నగరం 1957 జూన్ 23 న, 250 వ వార్షికోత్సవాన్ని జరుపుకొన్నది. నాటి ఉదయం లెనిన్ గ్రాడ్ పౌరులు, తమ నగరానికి 'లెనిన్ పతకం' బహూకరించబడినదని తెలుసుకొన్నారు. లెనిన్‌గ్రాడ్ పతాకపై అలంకృతమైన మూడవ పతకం ఇది. ఆ నగరవాసులు అక్టోబరు మహావిప్లవంలోను, జర్మన్ ఫాసిస్టు దురాక్రమణదారులకు వ్యతిరేకంగా సాగిన దేశభక్తి ప్రపూరితమైన మహా యుద్ధంలోను ప్రదర్శించిన వీరోచిత సాహస పాత్రకు, పరిశ్రమ, సంస్కృతులను పెంపొందింప జేయుటలో, వినూత్న సాంకేతిక రీతులను హస్తగతం చేసుకొనుటలో సాధించిన విజయాలకు ఇవి బహూకరింప బడ్డాయి.



అక్టోబరు మహా విప్లవంలో పాల్గొన్నవారు, వార్షికోత్సవాలలో కిరోవ్ స్టేడియంలో (పైన)

ప్రపంచంలోని అతిసుందర నగరాలలో లెనిన్‌గ్రాడ్ ఒకటి. ఈ నగరం, ఒక కార్మికుల నగరం, ఒక నిర్మాతల నగరం, ఒక వీరుల నగరం. ఇది స్టీమ్-టర్బైన్లను, హిమవిచ్ఛేదక అణు యంత్రాలను, భూగర్భ రైలు మార్గాలను, అనేకానేకంగా భవనాలను నిర్మిస్తున్న నగరం. మహత్తర శాస్త్ర పరిశోధనలకు, అద్భుత సృష్టిని చేసిన కళాకారులకు, నిర్మాతలకు, రచయితలకు ఇది పుట్టినిల్లు, రష్యన్ విప్లవాత్మక భావన ఆవిర్భవించి, ఆ కృతి ధరించి, మహత్తర విప్లవ సంప్రదాయాలు రూపొందినవి ఇక్కడే. ఇక్కడే జరిగింది అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం.

ప్రాచీన పీటర్‌పాల్ దుర్గంనుండి సరిగ్గా మధ్యాహ్నన సంప్రదాయానుసారంగా ప్రేల్చబడిన ఫిరంగి వందనం, వార్షికోత్సవ కార్యకలాపాలకు అంకురార్పణ చేసింది. దుర్గపు ప్రార్థనా మందిరపు గంటలు ఖణేల్లుమన్నాయి. సాలంకృత, నిత్యయవ్వన నగరవీధులు లక్షోపలక్షల నగర ప్రజలతో క్రిక్కిరిసి పోయాయి.

లెనిన్ గ్రాడ్ పురవాసులు ఈ ఉత్సవ దినాలను బహుకాలం గుర్తుంచుకొంటారు। నగరమంతా యెట్లా దీపాలతో అలంకరించబడినదీ, కిరోవ్ సంగీత నృత్య ప్రదర్శనాలయం దగ్గర వార్షిక మహాసభ యెట్లా ప్రారంభమైనదీ, ఆ మధుర క్షణాలు; పుష్కిన్ సంస్మరణార్థం కళల చౌకువద్ద నూతన స్మారక చిహ్నం ఎట్లా నెలకొల్పబడిందీ వారు పునశ్చరించుకొంటారు. వారు తమ పిల్లలకు, మహా విప్లవకారులు, అక్టోబర్లో శీతాకాలపు రాజభవనాన్ని ముట్టడించి, సువిశాలమైన స్టేడియం ప్రాంగణంలో ఎట్లా వీరవిహారం చేశారో, తర్వాత ఎట్లా మహత్తర ప్రజా విప్లవం ప్రారంభమైనదో చెబుతారు. వారి దృష్టిపథంలో చిరకాలం దీపించే మరో దృశ్యం, పీటర్ 1, ఆ నగరానికి పునాదులువేసిన నాటినుండి, నాటకీయంగా ప్రదర్శితమైన ఆ నగర 250 సంవత్సరాల చారిత్రక ఘట్టాలు. ఇది, అపూర్వ అనన్య పరిమాణం కలిగిన దృశ్యం. ఈ ప్రదర్శనలో వేలాది కళాకారులు, గాయకులు, నర్తకులు, క్రీడాకారులు పాల్గొన్నారు. నిరవధికమైన ఉత్సవ వైభోగం, ఉల్లాసకరమైన బాణాసంచా కాల్పులు, స్నేహితుల నృత్య గీతాలు—వీటిని ప్రజలు ఎన్నటికీ మరచిపోరు.

ఇంత వైభవంగా లెనిన్‌గ్రాడ్ తన వార్షికోత్సవం జరుపుకొన్నది. దీని పతాకమీద మరో లెనిన్-పతకం వున్నది. గౌరవ పురస్సరమైన ఈ బహుమతిని స్వీకరిస్తూ, నగర శ్రామిక ప్రజలు కమ్యూనిజం నవ నిర్మాణానికి లెనిన్ గ్రాడ్ ఇదివరకటిలాగానే ఇకముందు కూడా, ఎప్పటికీ రక్షణ శిఖరంగా మనగలదని విస్పష్టం చేశారు.



నేవా తీరాన విద్యుద్దీపాలంకృతాలైన యుద్ధ నౌకలు (కుడి)

(ఛాయా చిత్రాలు: ఎ. బతనోవ్, ఎస్. నామెన్కోవ్)

# వార్తా చిత్రాలు



ఢిల్లీ నగరంలోని భారత, సోవియట్ మిత్రులు కలుసుకోవడానికి అవకాశాన్ని కల్పిస్తూ శ్రీ కుమార్, శ్రీమతి కుమార్ 20 జులై, 1957న, తేనీటి విందు చేశారు. భారత-సోవియట్ సంస్కృతీ సంఘ స్థానిక శాఖ, ఇటువంటి స్నేహపూర్వక సమావేశాలను తరచుగా ఏర్పాటు చేయడానికి నిశ్చయించుకొన్నది.



39 సంవత్సరాల తమిళ రచయిత, శ్రీ పూర్ణ సోమసుందరం, 24 సంవత్సరాల సోవియట్ వనిత, మాస్కో ప్రచురణాలయోద్యోగిని శ్రీమతి రెదినా లెస్తిన్‌స్కయాల వివాహం, ఇటీవల మాస్కోలో జరుపబడింది. ఉక్రెయిన్ రెస్టారెంటులో ఈ వివాహ సందర్భంగా జరిగిన విందుకు నవ వధూవరుల మిత్రులనేకులు విచ్చేశారు.
భారత జాతీయ సంప్రదాయానుసారంగా వధువు భారతీయ వస్త్రధారణ చేసుకొన్నది.
వివాహ సమయాన భారత, రష్యన్ గీతాలాపన జరిగింది. వధూవరులను పుష్పమాలాలంకృతం చేశారు.

(ఛాయాచిత్రం: ఎం. రోద్కిన్)



మాస్కో చిత్రకారుల సంఘ ప్రదర్శనశాలలో శ్రీ మురళీ ఆర్. అచరేకర్ చిత్రప్రదర్శన జరుపబడింది.

ప్రదర్శనావిష్కరణ సందర్భంగా శ్రీ అచరేకర్ ప్రసంగిస్తోన్న దృశ్యాన్ని ఛాయాచిత్రం చూపుతున్నది. భారత-సోవియట్ దేశాలు సంయుక్తంగా నిర్మిస్తోన్న "పరదేశి" చిత్రంకోసం మాస్కోలోవున్న ప్రసిద్ధ భారత సినీనటులు నర్గీస్, దేవిడ్‌లను కూడా ఇక్కడ చూడవచ్చు.

(ఛాయాచిత్రం: ఇ యేవ్‌జెరిఖిన్)





జూన్ 30న, సోఫియాలో దశమ ఐరోపా ఛాంపియన్‌షిప్ పోటీలు పరిసమాప్తమైనాయి. సోవియట్ దేశ క్రీడాదళానికి అగ్రస్థానం లభించింది. ఆ క్రీడాకారులకు ఛాంపియన్ స్వర్ణ పతకాలు బహూకరించబడ్డాయి. ఈ దళంలో, మాస్కో, రీగా, డాన్ మీది రోస్తోవ్, కౌనాస్, త్బిలిసి, శాఖల క్రీడాకారులున్నారు.

ఛాయాచిత్రంలో: సోవియట్ దళం, 1957 ఐరోపా ఛాంపియన్. ఎడమనుండి కుడికి: ఎం. సెమ్యోనోవ్, వి. జుబ్‌కోవ్, వై ఒజెరోవ్, ఎం. లాగా, ఎస్. స్తోన్‌కస్, ఎ. బొచ్కర్యోవ్, జి. మినష్‌విలీ, ఎం. స్తుదెనిత్‌స్కీ, వి. తోర్బన్, వి. మ్యుజెపీక్స్, ఎం. వాల్దిమనిస్, ఎ. లాంతెనాస్. (ఛాయాచిత్రం: బోరిస్ స్వెత్లనోవ్)

# పాఠకుల అభిప్రాయాలు

ఈ సంచికనుండి పాఠకుల అభిప్రాయాలు అన్న శీర్షిక, మా పత్రికలో శాశ్వతంగా వుంటుంది. దీనిని కొనసాగించేందుకు, విషయాన్ని నేరుగా, సాధ్యమయినంత సూక్ష్మంగా తెలియజేస్తూ తమ ప్రత్యేక రచనలను పంపమని పాఠకులకు మా మనవి. ఈ శీర్షిక క్రింద వ్యక్తపరుపబడిన అభిప్రాయాలు, సంపాదకుని అభిప్రాయాలే అవనక్కర లేదు.

—సంపాదకుడు.

## ఉదజని బాంబు పాటవ పరీక్షలు

అయ్యా,

న్యూక్లియర్ ఆయుధాల పాటవ పరీక్షల నిలుపుదల గురించి చర్చించేందుకు జపాను రాయబారి ఏర్పరచిన సమావేశం సందర్భంగా, రాయిటర్ మాస్కోనుండి ఏప్రిల్ 21న పంపినవార్త, భారతదేశపు పత్రికలలో ఎక్కువగా ప్రచురింపబడింది.

న్యూక్లియర్ ఆయుధ పాటవ పరీక్షలను నిలిపివేయడానికి ఏకపక్షంగా నిర్ణయించి, న్యూక్లియర్ ఆయుధాలుగల యితర రాజ్యాలకు సోవియట్ దేశం ఆదర్శంగా వుండాలన్న జపాను రాయబారి ప్రతిపాదన, యీ దిగువ కారణాలవల్ల హేతుబద్ధమైనదీ కాదు, నీతిబద్ధమైనదీ కాదు:

1945లో జపానుకు వ్యతిరేకంగా గత ప్రపంచ యుద్ధంలో పరమాణు బాంబును అమెరికా తొలిసారిగా ప్రయోగించడంవల్ల,—ప్రపంచంలోని యింకే దేశాలకూ యిటువంటి ఆయుధం లేదని అప్పుడు విశ్వసింపబడేది—, మొదట న్యూక్లియర్ ఆయుధాల పాటవ పరీక్షలకు ఆపడంద్వారా అమెరికా యిప్పుడు ఆదర్శాన్ని నెలకొల్పాలి: సోవియట్ దేశానికి, లేదా ఇంగ్లండుకుగల యిటువంటి ఆయుధాలకంటె ఎంతో అభివృద్ధి చెందినటువంటి రకాలు తమకు గలవని అమెరికన్లు చెప్పుకుంటూవుండడంవల్ల ముఖ్యంగా అమెరికా ఇప్పుడు ఆదర్శాన్ని నెలకొల్పాలి.

గత యుద్ధంలో జపానుపైని అమెరికా పరమాణు బాంబు ప్రయోగం, యుద్ధం గనక సంభవమయినట్టయితే, అమెరికా తన వద్దనున్న న్యూక్లియర్ ఆయుధాలను ప్రయోగిస్తుందనీ, రక్షణ కొరకు తక్కిన దేశాలు దీనినే అనుసరిస్తాయనీ, మానవజాతికి విపరీతమైన వినాశనం కలుగుతుందనీ నిరూపిస్తున్నది.

ఈ పరిస్థితులలో అమెరికా ముందుకువచ్చి న్యూక్లియర్ ఆయుధాల పాటవ పరీక్షల ఆపుదలకు తన నిర్ణయాన్ని ప్రకటించినట్టయితే, మానవజాతి శ్రేయస్సుకోసం యితర దేశాలు అమెరికాను అనుసరించవచ్చును.

సోవియట్ దేశం తన పరీక్షలను రక్షణ నిమిత్తం తన భూభాగం పైననే చేస్తున్నది. యిటువంటి పరీక్షలవల్ల మానవారోగ్యానికి ఏదైనా ప్రమాదం వున్నట్టయితే, యిరుగు పొరుగు దేశాలకంటె సోవియట్ దేశ ప్రజలు యెక్కువగా బాధపడతారనడానికి సందేహమేమీలేదు.

యన్. జి. దత్
అలహాబాద్.

ఈ విషయంపైని సోవియట్ అభిప్రాయంకొరకు 'సోవియట్ భూమి 14వ సంచికలో ప్రచురింపబడిన' జపానీస్ వార్తా పత్రిక "అసాహీ షింబుమ్" సంపాదకుడు మిస్టర్ తొమూ హిదూకాకు నికితా కృశ్చెవ్ యిచ్చిన ఇంటర్వ్యూను పాఠకులు చదవమని మనవి.

—సంపాదకుడు.

## మా పరిశ్రమాగారం ఎట్లా నడుపబడుతుంది

[6వ పేజి తరువాయి]

"షాపు సూపరెండెంటు, పెద్ద కార్యకర్తలూ సొలొవ్యోవ్ కొత్త కట్టర్లను ఎందుకు మర్చిపోయారు?" "పనులపట్ల యీ దృక్పథం మంచిదేనా?" "కార్యకర్తలు యిందుకు సంజాయిషీ చెప్పాలి!" అన్నారు కార్మికులు.

వారు సంజాయిషీ చెప్పవలసి వచ్చింది-షాపు సూపరెండెంటు, అసిస్టెంట్ ఛీఫ్ ఇంజనీరూ! ఉత్పత్తి సమావేశం, యీ కొత్తపనిని ఆచరణలో పెట్టడానికి ఆఖరు తేదీని నిర్ణయించింది; యీ విషయాన్ని పరిశీలించి, మరుసటి సమావేశంలో నివేదించమని కార్మిక సంఘానికి చెప్పింది. ఈ నిర్ణయం సంపూర్ణంగా నిర్వహింపబడింది.

ఉత్పత్తి సమావేశాలు మా పనిరోజు జీవితంలో స్థిరపడిపోయాయి; ఉత్పత్తి నిర్వహణలో కార్మికులందరూ పాల్గొనేందుకు గట్టి సాధనాలయ్యాయి, కార్మికుల, ఫోర్మెన్ల, సాంకేతిక విషయజ్ఞుల, ఇంజనీర్ల వారపు సమావేశాలు, పనిగురించి అవి స్వేచ్ఛగా చేసే విమర్శలు, వ్యవహార సరళిలో జరిగే వాటి చర్చలు, లోపాలగురించి అవి సూటిగా చేసే ఫిర్యాదులు, వాటి విలువైన సూచనలు మొదలైనవి యంత్రపరికరాల ఉత్పత్తిని అధికం చేయడానికీ, టెక్నాలజీని అభివృద్ధిచేయడానికీ గట్టి చర్యగా వుండక తప్పవని గ్రహించడం కష్టమేమీకాదు.

పరిశ్రమయొక్క కార్మిక సంఘం, పరిపాలనపైని కార్మికుల కంట్రోలును ఏర్పరచడంలో ముఖ్యపాత్రను నిర్వహిస్తుంది. కార్మిక సంఘమే, కార్మికుల ఉత్పత్తి సమావేశాలను ఏర్పరచడంలోనూ, కార్యకర్తల కార్యకలాపాలపైని యితర రూపాలలో కంట్రోలును పెట్టడంలోనూ తీవ్రంగా కృషిచేస్తుంది. కార్మికుల సమిష్టి సంఘం, దాని సాంఘిక సంస్థలూ పరిశ్రమకు అధినేతలు, ప్రతి ఒక్క విషయానికి తామే బాధ్యులమని అవి భావించుకుంటాయి.

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరఫున, జి. ఎఫిమోవ్ చే 25, బారాకంబా రోడ్, న్యూఢిల్లీ నుండి సంపాదితము, ఎన్. కె. దొరొద్నిత్సిన్ చే ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు : పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ—6.:

# కలలు, కలలు....!



చివరకు వోవా అల్లరి మానాడు
(చిత్రకారుడు : ఫ్రిద్మన్)

కుందేళ్ళ వేట
(చిత్రకారుడు : ఫ్రిద్మన్)











